

# భావిలో నీళ్లు ముంచుకోను స్వాగతించండి!

నీళ్ళు మనందరికీ ప్రాణాధారకం. అది మన శరీరాన్ని పరిశుద్ధ పరుస్తుంది. మన దప్పిని ఆర్పుతుంది; అది మనందరికీ పరమాత్ము డొసగిన మహాదానం!

సర్వమానవ సౌభ్రాతృత్వంతో మన హృదయాల్ని పావనం చేసుకుందాం – మన సోదర సోదరీ మణుల్లాగానే హరిజనులకును స్వాగత మొసగుదాం.

> "హిందూ శాస్త్రాల్లో అస్పృశ్యత అనునది ఎక్కడా లేదు."
>
> —మహాత్మాగాంధి.

**అస్పృశ్యతను నిర్మూలించండి.**
**సర్వసమత్వాన్ని పెంపొందించండి.**

వ్యవస్థాపకులు
డాక్టరు కే. యన్. కేసరి

# గృహలక్ష్మి.

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౨౮] ఫిబ్రవరి 1957 [సంచిక ౨

# విషయసూచిక

—(౦)—

ముఖచిత్రము : హిందీతార మీనాకుమారి
By Courtesy of 'Lokavani'



పార్వతీ పరమేశ్వరులు




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతిమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



## కాంగ్రెస్

ప్రతిజాతికి, దేశానికి ప్రజాశ్రేయస్సు నుద్దేశించి అభ్యుదయ మార్గంలో నడిపించగల సమర్థనీయమైన నాయకత్వము అత్యవసరము. ఇట్టి నాయకత్వమున కనువగు యోగ్యతలు యీనాడు మన దేశంలో కాంగ్రెస్‌కుతప్ప మరేపార్టీకి లేవనే రాయి గుద్ది చెప్పవచ్చును. కాబట్టి రానున్న ఎన్నికల ఫలితాలు రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలలో కాంగ్రెస్ నాయకత్వమును అధికారములోకి తేవలసియున్నది.

జాతీయ కాంగ్రెస్ గాంధీజీ నాయకత్వముక్రింద జరిపిన జాతీయ సమరము, ఆర్థిక, రాజకీయ, సాంఘికరంగాలలో సాధించిన ఘనవిజయాలు యీనాటి పురోగామిగానున్న స్వతంత్ర భారతానికి పునాదులను విషయము మరువరానిది. కాంగ్రెస్ అధిష్టానవర్గసభ్యులు కొందరు సంపన్నులు, పెట్టుబడిదారులయినా కాంగ్రెస్ సంస్థ మాత్రం సామాన్య ప్రజానీకపు శ్రేయస్సు నుద్దేశించి ఆర్థిక, సాంఘిక రాజకీయ రంగాలలో పోరాడి, త్యాగములుచేసి, నిరంతర కృషిపట్ల ఆసక్తి చూపుచున్నది.

దానితో సమానంగానో, మెరుగుగానో జాతీయరంగంలో శ్రేయోపురోభివృద్ధులను తీర్చిదిద్దిన మరొకపార్టీ యీ నాటికి కనుచూపుమేరలో కనుపించుటలేదు. ప్రజాభిమానమునకు పాత్రమై, ప్రజల అండదండలతో యీనాటివరకు దేశానికి నాయకత్వము వహించిన కాంగ్రెస్ యీనాడింకా ప్రజలను తమవెంట నడుపగలుగుచుండుటకు దాని ఉత్తమ ఆదర్శలక్ష్యాలు, విశాల దృక్పథం, ప్రజలతోగల సన్నిహిత సంబంధము కారణము. ప్రజలు కాంగ్రెస్ విజయోపేతంగా నాయకత్వము వహించి జాతీయాభ్యుదయాన్ని మరింతవడిగా ప్రోత్సహించాలని ప్రజలు ఆశిస్తున్నారు.

కాంగ్రెస్ సంస్థ మహోజ్వలమైన చరిత్రగలదైనా అందులోని సంకుచితతత్వాలకుగురియైన స్వార్థపరులు లేరని చెప్ప సాహసించుటలేదు అట్టివారి బారినుండి సంస్థను రక్షించుట సంస్థలోనుండియే పోరాడి సంస్థను సంస్కరించి మరింత ప్రజోపయుక్తంగా చేయాలికాని కాంగ్రెస్‌నుండి బయటికివచ్చి ఏదో ఆ సంస్థను చేయగలమనిగాని, ప్రజలకు కాంగ్రెస్‌కంటె ఏదో అధికంగా ఒరగబెట్టగలమనిగాని రగడ చేయడం వృథా ప్రయాసతప్ప మరేమిలేదు. కాంగ్రెస్‌నుండి బయటికివచ్చిన సోషలిస్టు, ప్రజాసోషలిస్టు, యిత్యాది జాతీయ పార్టీలు స్వయంగా ముందడుగువేసి చేయకలిగింది కనుపించదు ; చేయసంకల్పించుకున్న కాంగ్రెస్‌ను బలపరచుట కనుపించదు. ఆయా పార్టీనాయకులు వ్యర్థ తర్కాలతోటి, క్రమశిక్షణారహితంగా అభివృద్ధి అభ్యుదయాలను, నిరోధించ ప్రయత్నించుటకంటె చేయుచున్నది మరేమిలేదు.

ఇక ప్రతి చిన్న, పెద్ద సమస్యలను అంతర్జాతీయ దృష్టితో చూచు చున్నట్లూహించు కమ్యూనిస్టుపార్టీపట్ల భారత ప్రజలకు విశ్వాసము లేనందుకు అనేక కారణములున్నవి.

నిలువు, నిదానము, నిలకడైన విధానములులేక తమ లక్ష్యసాధనకని ప్రజలలో అశాంతిని, హింసాకాండను ప్రోత్సహించే కమ్యూనిస్టుపార్టీ విధానాలు జాతీయ శ్రేయస్సు కనువైనవికావు. ప్రజల ఆదరాభిమానములు, సహకారము పొందజాలని కమ్యూనిస్టుపార్టీ విశ్వాసమును పూరించగలదని ఎవరును యూహించలేరు. జాతీయ సమస్యలను దేశకాల పాత్రముల కనుగుణ్యంగా పరిష్కరించుటకు బదులు ప్రతి దానిని యితర దేశాల విధానముల ననుసరించి పరిష్కరించాలని ప్రయత్నించే

కమ్యూనిస్టుపార్టీకి, మన జాతీయ ఆదర్శ లక్ష్యాలను అర్థముచేసుకోగల అవకాశాలు యింతవరకు కనుపించలేదు.

ఇవి యిలాగుండగా కులతత్వాలను, మతతత్వాలను ఆధారంచేసికొని అధికారం, నాయకత్వము చేజిక్కించుకోవాలని ప్రాకులాడే పార్టీలవలన, వ్యక్తులవలన దేశానికి అనర్థమేకాని శ్రేయస్సు సమకూరజాలదు.

ఈ పరిస్థితులలో జాతీయబలాన్ని సమీకరించి పండిట్ నెహ్రూ నాయకత్వము క్రింద సర్వతోముఖమైన ప్రజాభ్యుదయాన్ని, శ్రేయోపురోభివృద్ధులను తీర్చిదిద్దగలిగినది కాంగ్రెస్ నాయకత్వము ఒక్కటే. అదిమాత్రమే దేశాన్ని అరాజకమునుండి రక్షించి ప్రజలకు శాంతి సౌభాగ్యములను, అంతర్జాతీయ కీర్తి ప్రతిష్టలను ఆర్జించిపెట్టగలది. ప్రజలు ఏకోన్ముఖంగా కాంగ్రెస్‌ను బలపరచి, అనుసరించి, అవసరమైతే సంస్కరించి కేంద్రరాష్ట్రాలలో కాంగ్రెస్ ప్రభుత్వాలు ఏర్పడడానికి ప్రజలు ఓట్లనిచ్చి తోడ్పడాలి!

—— (౦) ——

## సభలు, సమావేశములు

పిఠాపురం మహిళల రిక్రియేషన్ క్లబ్ ప్రథమ వార్షికోత్సవము 26-1-57 న తూర్పు గోదావరిజిల్లా పోలీసు సూపరింటెండెంటుగారి సతీమణి శ్రీమతి పద్మావిక్టర్ అధ్యక్షతను జరిగినది. శ్రీమతి బారు సరోజనీదేవి అధ్యక్షురాలిని, సభ్యురాండ్రకు పరిచయంచేస్తూ స్వాగతం చెప్పారు. క్లబ్ ఆవశ్యకతను గురించి శ్రీమతి రాయవరపు అన్నపూర్ణ, డాక్టర్ శ్రీమతి ఆర్. సుభద్రాదేవి ప్రసంగించారు. కుమారి భమిడిపాటి అచ్చమాంబ వీణకచ్చేరి అనంతరం నాటికా ప్రదర్శనలు జరిగినవి. నాటికలలో పాల్గొన్నవారికి శ్రీమతి జ్ఞానాంబా రామనాథం బహుమతులు పంచిపెట్టారు; క్లబ్ అధ్యక్షురాలు శ్రీమతి జట్లా నాగమ్మ వందన సమర్పణ చేసారు.

♦ ♦ ♦

ఫిబ్రవరి 5-వ తేదీ సాయంత్రం 5 గం॥లకు రాజమండ్రి విక్రమహాలులో ప్రఖ్యాత నటకులు శ్రీ అంకరాజు శంకరావుగారి అధ్యక్షతను శ్రీ నాట్య భారత్ ప్రొడక్షన్సు ప్రైవేటు లిమిటెడ్ ప్రారంభోత్సవం జరిగెను. ఈ సంస్థకు శ్రీ గరికిపాటి రాజారావుగారు మేనేజింగ్ డైరెక్టరు.

# యాదవవీర చరిత్ర

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు

యాదవవీరచరిత్ర ఒక జంగంకథ; కొంత ద్విపదలోను, కొంత మంజరిలోను రచించబడింది. అనేక చిన్న కథలు కలిసి తయారయిన పెద్ద గ్రంథమిది. దీనికి యదుశాస్త్ర చరితమని మరొక పేరు.

> ....యదుశాస్త్ర చరిత్ర మంతయును
> వినిపింతు యాదవవీర చరిత్ర
>
> (కాటమరాజుకథ, పుట-1)

అన్నాడు కాటమరాజు కథను *[1] రచించిన గంగుల శీన దొమ్మలయ్య.

యాదవవీరచరిత్రనే యాదవవీరభారతం అని కూడ పిలవవచ్చు. ఇది చాల పెద్ద గ్రంథం కాబట్టి 'యాదవశాస్త్రం ఎద్దుమోత ప్రమాణం,' అను లోకోక్తి పుట్టింది.

యాదవవీరచరిత్ర అనేది అనేక చిన్న కథల సంపుటి అని చెప్పేను. దీనిలో నల్లరాజుచరిత్ర, పోలురాజుకథ, కాటమరాజుకథ, అగుమంచికథ, ఎరగడ్డపాటి పోట్లాట, కోటపాటి కాటివృత్తంతెచ్చే కథ, పెద్దిరాజుచరిత్ర, బొల్లావు యుద్ధం, ఆవుల పరువు, ఉత్తర కాండం, దక్షిణ కాండం, కరియావుల కథ, భక్తిరన్నకథ మొదలైనవి♦[2] ఉన్నాయి.

యాదవవీరుల చరిత్రలో ప్రధానకథ కాటమ రాజుకథ. నెల్లూరి పాలకుడైన నల్లసిద్ధిరాజు (ఇతను మనుమసిద్ధిరాజు అని కొందరి అభిప్రాయం)కి, కాటమరాజుకి పుల్లరి - అడవిలో పశువులు మేయడానికి కట్టవలసిన [3]† డబ్బు - విషయమై తగాదా వచ్చింది. రెండువైపులవారు యుద్ధంచేసేరు. మరణించేరు. దీని తాలూకు కథలనే 'గొల్లసుద్దులు' అంటారు. వీటిని పాటగాళ్లు శివమెత్తి పాడుతూంటారు, కాబట్టి వీటికి 'గొల్లశివాలు' అను పేరుకూడ వచ్చింది. కువలయాశ్వ విజయం అను తెలుగు ప్రబంధంలో—

> ఒక్కండు పట్టుగాఁ నూకొన దబ్బిబ్బు
> పాటు 'గొల్లసివాలు' పాడుకొనుచు
>
> (ద్వి. ఆ. 114 పుట)

కాటమరాజుకి సంబంధించిన ఈ కథలన్నీ జంగం కథలే! వీటిని కృష్ణాజిల్లా, నెల్లూరు జిల్లాలో పాట

---

*[1] కాటమరాజుకథను యమ్. సంజీవకవి పరిష్కరించి 1917-లో అచ్చువేసేడు. ఈ కృతికర్త పేరు నందుల కాటమరాజు అని తెలియజేయబడింది (చూడు - ఆంధ్రపత్రికవారు అచ్చువేసిన ఆంధ్రవాఙ్మయ సూచిక, పుట 94.) కాని కవిపేరు పొరబాటుగా అట్లు అచ్చుపడిందని చెప్పవచ్చు. ఈ అచ్చుప్రతి లభ్యం కావడంలేదు.

♦[2] ఈ భాగాలన్నీ మదరాసులోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నాయి. ఈ భాండాగారంవారే కాటమరాజుకథ, భట్టురాయబారం, కోటపాటి కాటివృత్తంచెప్పేకథ, ఎరగడ్డపాటి పోట్లాట అను వాటిని ఒక సంపుటంగా అచ్చువేసేరు. మిగత భాగాలను గురించి తదితరులు తెలుసుకోదలచినవారు ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక 1953-54 'కాటమరాజుకథ' వ్యాసాన్ని చూడవచ్చు.

†[3] పుల్లరిని ఇంగ్లీషులో Grazing fees in the forests అంటారు. దీనిని గురించి మదరాసు గవర్నమెంటువారు ఈ కాలంలో చేసిన నిర్ణయమిట్లుంది. "రాష్ట్రములోని అడవులకు - పంచాయతి అడవులనుకూడ చేర్చి - సమానంగా (Uniform) పుల్లరి ఇట్లు నిర్ణయించబడింది - గొర్రెకి 2 అణాలు, ఆవుకి 4 అ, గేదెకి 8 అ. (4-8-53 నాటి హిందు పత్రిక పుట 2 లోని విషయమునకు ఆంధ్రానువాదం)

గాళ్లు ఊరూర పాడి జీవనోపాధి గణించుకొంటారు.

## కాటమరాజు కథ

నల్లసిద్ధిరాజు, కాటమరాజు పుల్లరి విషయమై వివాదపడి యుద్ధం చేసేరు. దీనిలో పుట్టిన అనేక కథలలో కాటమరాజు కథ ప్రముఖమైనది. ఈకథలో పశువులకోసం యుద్ధం చేయడం ఒక ముఖ్యఘట్టం.

## పశువులకోసం జగడాలు

పశువులకోసం రాజులు దెబ్బలాడుకోడం మహాభారత విరాటపర్వంలో గోగ్రహణం అను పేరున వర్ణించబడింది. కాటమరాజుకథకూడ కొంతవరకు గోగ్రహణ సంబంధమైనకథే. పూర్వకాలంలో ఇట్టి జగడాలు అప్పుడప్పుడుంటూండేవని చెప్పవచ్చు. ప్రతాపచరిత్రం♦లో గోవులకోసం రాజులు కొట్లాడుకొన్నట్లు చెప్పబడింది. దానిని రెండు మాటలలో తెలియజేస్తాను. కందారం ముఖ్యపట్టణంగా సోమదేవరాజు ఏలుతున్నాడు. అతని దేశంలోని గోవులను కటకం రాజధానిగా చేసుకొని పరిపాలించే రాజు ఎత్తుకుపోయేడు. సోమదేవరాజు కటకవల్లభుడిమీదికి పదిసార్లు దండెత్తివెళ్లేడు. కాని లాభం లేకపోయింది.

క్రీస్తుశకం ప్రారంభందని చెప్పబడే తమిళగ్రంథమైన తొల్కాప్పియంలో ప్రతి గ్రంథంలో ఉండవలసిన సంప్రదాయాలను గురించి చెప్పబడిన యంశమిట్లుంది - "యుద్ధాది వర్ణనమున మొదట గోగ్రహణముతో ప్రారంభింపబడవలయును. అది పర్వత దేశమందె జరిగినట్లు సూచింపబడవలె. దాడి వెడలుటకు సంబంధించినది అడవి ప్రదేశము. ముట్టడి మాగాణి ప్రదేశములో జరిగినట్లు సూచింపబడవలె.*

గోగ్రహణానికి ఇతర నిదర్శనాలు - "గాంగ పల్లవుల కాలములో పశువులను దొంగిలించెడివారని ద్రవిడ చారిత్రములలో నంబులు వర్ణింపబడియుండిరి. అట్టి గోగ్రహణముగూర్చి తెలిపెడు రెండు శాసనములు ఉత్తర ఆర్కాడుమండలములోని ఆంబూరుకడ గానిపించినవి ‡."

## కాటమరాజు ప్రశంస

కాటమరాజు, అతని పేరనున్న జంగంకథలలోనే గాక, ఇతర రచనలలోకూడ ప్రశంసింపబడ్డాడు.

మూర్ఖశతకంలో —

'రామాండకతలంబె మేమెఱుంగనివనా
కాటమరాజుకి కర్ణుడోడె'

అని ఉంది. పై చరణాలు సి. పి. బ్రౌనుగారి వ్రాతప్రతిలో గుర్తించబడ్డాయి. హంసవింశతి ప్రబంధంలో, రెండో ఆశ్వాసంలో 87, 91 పద్యాలలో-

ఉ. కొమ్ములు వీరణాలు జిగి గుల్కెడు
వ్రాతల కృష్ణలీలలం
గ్రుమ్మ గుడార్లు వీరుఁడగు కాటమ
రాజు కథానులాపముల్.

అనీ,

మ. కొలిచెం గాటమరాజులన్ నతులు
సేకూర్చెన్ మహా వీర్లకుం

అని చెప్పబడ్డాయి. కాటమరాజు ఆంధ్రవాఙ్మయానికి బహుపరిచితుడు. హంసవింశతి ప్రబంధంలోనె ప్రజలు కాటమరాజుని సంతానంకోసం కొలుస్తారని చెప్పబడింది. కాటమరాజుని గురించి లోకల్ రికార్డుల 18.వ సంపుటంలో రెండు కైఫీయతులున్నాయి. కాటమరాజు అను పేరు జానపదగేయాలైన గొబ్బిపాటలలో వస్తుంది.

---

♦ [4] ప్రతాపచరిత్ర అను వచనకావ్యాన్ని ఆంధ్రసాహిత్యపరిషత్తు, కాకినాడ - వారు అచ్చువేసేరు.

* [5] కోరాడ రామకృష్ణయ్యగారు రచించిన 'దక్షిణదేశభాషా సారస్వతములు-దేశి' అను గ్రంథము, పుట 84.

‡ [6] చిలుకూరి వీరభద్రరావుగారి ఆంధ్రుల చరిత్రము, పూర్వభాగము, పుట 255.

కాటమరాజు శ్రీకృష్ణునియొక్క అవతారమట. ఇతనికి ఇంకా మరికొన్ని పేర్లున్నాయి.

పరజన్మమెత్తుటచే నలనన్న
ఆవులగాచుటచే ఆవులన్న
పశువులకు పట్నముగట్ట పశువులన్న
కాట కోటేశ్వరుడు కాటమరాజు.

పైగా ఇతనికి డెబ్బైయేడు †[7] బిరుదులున్నాయి. కాటమరాజు అను పద్య ప్రబంధాన్ని గుఱ్ఱము కొండ భక్తవత్సలకవి §[8] రచించేడు. ఇతని కాలం తెలియదు కాని ఆ గ్రంథం ముద్రించబడింది.

కాటమరాజు తిరునాళ్లు జరుపబడుతున్నాయి. వీటినె గంగతిరునాళ్లనికూడ అంటారు.

## గొబ్బెమ్మ

కాటమ్మరాజుకథకి సంక్రాంతి పండుగలోని గొబ్బి వేడుకలకి ముడిపెట్టబడింది. కాటమరాజు చెల్లెలిపేరు పాపనూకమ్మ. ఈమెయె గొబ్బిదేవిట! కాటమరాజు ఈమెకు కొంత భూమి ఈయదలచుకొన్నాడుట. కాని ఈయడానికి పూర్వమె అతను మరణించిందుట. అప్పటినుండి గొబ్బిదేవి కాటమరాజు ఈయదలచుకొన్న భూమిలో ఏటేట వెలుస్తూందట. ఆ కారణంవల్ల గొబ్బి పూజలను చేస్తున్నారు. ఈ ఆచారం విశేషంగా రాయలసీమలో ◆[9] ఉంది.

ప్రజలకు పాడిపంటలవసరం. కాటమరాజు పేరు (పశువుల) పాడితోను, గొబ్బిదేవిపేరు పంటలతోను ముడిపెట్టేరు. పాడిపంటలను చెల్లెలు, అన్నా అన్నారు.

## శాసన కాలం ఏది?

కాటమరాజు ప్రశంస గుండ్లపాలెంలో బ్రహ్మేశ్వరాలయంలో ఒక స్తంభంమీదనున్న శాసనం[9A]లో ఉంది. ఈ శాసనం తికమకగా ఉంది. దీనికి కారణం లేకపోలేదు. ఇది ఉద్ధరింపబడ్డ శాసనం అని దానిలోనె చెప్పబడింది. అనగా, శాసనం శిథిలావస్థలో ఉండగా మరొకరు దాని ప్రతిని చక్కగా తీయించేరన్నమాట. ఇదే కొంత తికమకకి కారణం. అసలు శాసనకాలంఏది? ఉద్ధరించిన శాసనకాలంఏది?

శాసనంలో తిథివారాలతోకూడ ఈయబడ్డ శక సంవత్సరం (1170?) సరిగాలేదు. దీనిని గురించి పలువురు పండితులు చర్చించేరు. ఇది సరిగాలేదని కొందరు నిర్ణయించేరు. క్రీ. శ. 1258 యే అని కొందరి అభిప్రాయం. "శా. శ 1180 కాళయుక్తి కార్తీకశుద్ధ 5 గురువారము క్రీ శ. 3-10 1258. కాని అధిక కార్తీకమైనది. శా. స. 13(0 కాళయుక్తి కార్తీకశుద్ధ 5 గురువారము 23-10-1438 అగును" అని దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు 10-4-40 నాటి స్వతంత్ర పత్రికలో విమర్శించేరు. కాలవిషయమై ఏలాగున్నా ఒక విషయంమట్టుకు వెంకటకృష్ణారెడ్డిగారు స్పష్టంచేసేరు. ఈ శాసనంలో ఈయబడ్డ యదువంశ విషయంలో ఉండే కొంత వచనాన్ని, కొన్ని పద్యాలను భారత భాగవత గ్రంథాలలో

---

†[7] ఆంధ్రపత్రిక విజయ సంవత్సరాది సంచికలోని కాటమరాజు అను వ్యాసం.

§[8] గుఱ్ఱము భక్తవత్సలకవి ఆంధ్ర తిరుప్పావు, ఉద్ధవకథ యక్షగానం, సుబుద్ధిశతకం, రేణుకాదేవి దండకద్వయాన్నికూడ రచించేడని మే 1953 భారతి 432 వ పుటలో ఉంది. ఈ పుస్తకానికి కత్తియావుల కాటమరాజుకథ అను మరొకపేరు ఉంది. దీనివ్రాత ప్రతి List of rare manuscripts in Sri Venkateswara Criental Institute Tirupati, P170 లో ఉంది.

◆[9] మే 1943 భారతి సంచిక పుట 434

[9A] బటర్‌వర్తు, వేణుగోపాలస్వామిగారలు ప్రకటించిన నెల్లూరి శాసన సంపుటాలు, సంఖ్య?

ఉన్నట్లు కనుగొన్నారు. శాసనకాలం కనుగొనడానికి ఇదొక గొప్ప ఆధారం. కాబట్టి శాసనంలోని ఆయా భాగాలను సూచిస్తాను.

1. అదితికి కశ్యపునకుపుట్టి ... మానవులు అనేకులు పుట్టిరి (నన్నయ భారతము, ఆదిపర్వము III 87).

2. జలధి తీరమున - మోదులాడి (తిక్కనభారతం, మౌసల పర్వ I 90).

3. అనూరుడనువాండు ... పూర్వ కాలమున (ఆంధ్రభాగవతం, దశమస్కంధం, పూర్వ 18).

4. గోపికా జనకులు ... భాద్రనీవు. (భాగవత దశమ, పూర్వ. 59).

5. నానావిధ సంపదలకు... మెరింగించచ్చ (భాగవతదశమ పూర్వ. 60, 61).

6. తొల్లి స్వాయంబుమను ... ప్రజాపతి (భాగవత, దశమ. పూర్వ 131).

7. అవనీశవిను, ... జన్మించె (భాగవత దశమ పూర్వ. 353).

ఇట్లు భారత భాగవతాలలోని భాగాలు తప్పులతో, స్వల్పమైన మార్పులతో శాసనంలో ప్రకటించబడ్డాయి.

ఆంధ్ర భాగవత కర్తయైన బొమ్మెర పోతన. క్రీ. శ. 1400 - 70 మధ్య జీవించేడని చెప్పవచ్చు. బొమ్మెర పోతన భాగవతంలోని పద్యాలు క్రీ. శ. 1438 ప్రాంతాలలోని శాసనంలో ఉండడం సబబని చెప్పవచ్చు. కాబట్టి శాసనం ఉద్ధరింపబడ్డ కాలం వెంకట కృష్ణారెడ్డిగారు చెప్పినట్లుగా శా. శ 1360 కాళయుక్తి కార్తీక శుద్ధ 5 గురువారం, అనగా, క్రీ. శ. 23-10-1438 అవుతుంది. దీనిని బట్టి క్రీ శ. 1438 కి పూర్వమె ఆంధ్ర భాగవతరచన పూర్తి అయిందన్న అంశంకూడ నిర్ణయమవుతూంది.

## కాటమరాజు ఏకాలంవాడు ?

కాటమరాజుకి నల్లసిద్ధిరాజుకి పుల్లరి విషయమై జరిగిన యుద్ధంగురించి పైశాసనంలో చెప్పబడింది. దీనివల్ల కాటమరాజు యదార్ధపురుషుడే అని, యుద్ధం నిజంగా జరిగిందని స్పష్టమవుతూంది.

ఈ శాసనం శిలా స్తంభంయొక్క నాలుగు వైపులా చెక్కబడింది. దీనిలో రెండో ప్రక్క - పంక్తి 40 'వోరుగంటి ప్రతాపరుద్రుని కాలమున శా 41 టమ రాజు రాజ్యం సెనిలింగాల కొండయరగడ పాట 42 ను నలసిది రాజు గూడి యుద్ధంబు సేసి బడుగుల వారు 43 చనిపొయ్యెనాంటికి ... ... ... ... ... పై విషయమే పెక్కుతబిసీళ్ళతో మూడు, నాలుగు వైపుల చెప్పబడింది. * 10

జరుగంటి ప్రతాపరుద్రుని కాలంలో పైయుద్ధం జరిగుంటుంది.

పినయెల్లన్న రచించిన కాటమరాజు కథలో కాటమరాజును సంబోధించేటప్పుడు 'ప్రతాప' అను విశేషణంతో వస్తూంటుంది.

## శ్రీ నా థు డు

కాటమరాజు కథను శ్రీనాథుడు రచించినట్లుగా కాటమరాజు కధను ప్రబంధంగా రాసిన ఒక కవి ఇట్లు తెలియజేసేడు _

శ్రీ నాథుడను కవి శ్రేష్ఠుడు ద్విపదగా
రచియించె కాటమరాజు చరిత

కాని శ్రీనాథుడు రచించేడన్న భాగం నేటివరకు లభించలేదు. అయితే ఈ కధను నిజంగా శ్రీ నాథుడు వ్రాసేడా ? అసలు దీనిని శ్రీ నాథుడు వ్రాసేడని అనుమానం కలగడానికి కారణం, కాటమరాజు కథను మంజరిలో వ్రాసిన గంగుల పినయెల్లన్న వాక్యాలు కావచ్చు. పినయెల్లన ఈ కధను రాస్తూ -

(సశేషము)

* 10 ఈశాసనం పూర్తి పాఠం చూడగోరువారు ఆంధ్ర పత్రిక విజయసంవత్సరాది సంచిక 1953-54, పుటలు 41-44లో గాని, ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంవారు ప్రకటించిన కాటమరాజు పుస్తకంలోగాని చూడవచ్చును.



# కళారాధన



శ్రీ కన్నెకంటి ప్రభాకరశాస్త్రి

* * * * * * *

"సుజాతా - ఈనాటికి మనకష్టాలు గట్టెక్కినవి" అన్నాడు యింట్లో అడుగు పెడుతూనేరాజు. 'ఏమిటండీ' అన్నది ఆత్రతతో తన విశాలమైన కళ్ళను త్రిప్పుతూ. 'మన చయిర్ మను, ఆయన చిత్రాన్ని చిత్రించమని చెపుతూ వెయినూట పదహార్లు యిస్తానని వాగ్దానంగూడా చేశాడు' అన్నాడు రాజు ఆనందంతో. 'నిజంగానటండి - ఆ స్వామికి ఈనాడు మనపై కనికరం కలిగింది' అన్నది సుజాత. 'అవును సుజాతా - నిన్ను కొత్తపచ్చచీర, నల్లని రవికెతో అలంకరించాలనిఉంది సుజాతా' అన్నాడు రాజు. 'మీరు ఎంత అమాయకులండి...మీ హృదయంలో నేనులేనా! మీ అనురాగంకన్న నాకు కావలసినదేముంది?'

''అంతేలే సుజాతా... లేకపోతే మన కోరికలెట్లాతీరుతవి... అందరివలెనే నిన్నూ కూర్చోబెట్టి సర్వాంగ సుందరంగా అలంకరింపజేసి అన్ని సుఖాలు అనుభవింపజేయాలని ఆశపడతాను... నీకోర్కెలను తీర్చుతూ నీ సున్నితమైన చేతులను సుమసమానంగా ఉంచుదామనుకొంటాను ... నిజంగా నా అదృష్టంకొద్ది లభించావు సుజా .... నిన్ను వివాహమాడి నేనెంతే ధన్యుణ్ణయ్యాను కాని ... " అని ఆగిపోయాడురాజు.

'ఆగండి ... ఏమిటామాటలు. భర్త అనురాగంకన్న స్త్రీకోరేదేముంటుంది ఈ ప్రపంచంలో,...ప్రసిద్ధచిత్రకారుడైన భర్తను పొందాను. వారికి ప్రేమపాత్రురాలనయ్యాను. నాకు మిమ్మల్ను భర్తగా కూర్చినందుకు భగవంతుని ప్రార్థించని రోజులేదు. మీ ఉద్దేశము మనము బీదవాళ్ళమనిగదూ! ధనము శాశ్వతమా?'

'అవును. అలానుకొని సరిపెట్టుకోవాలి; లేక చేయగలిగిందేముంది చెప్పు. ధనవంతులందరూ కార్లలో తిరుగుతూ భవనాలలో నివశిస్తుంటే ఈర్ష్యపడటంకన్న చేసేదేముంది. ఈ వేదాంతమే లేకపోతే సగము మానవజాతి భాగ్యవంతుల మేడలను పగులగొట్టేదేమో!'

'ఊరుకోండి ఏమిటాధోరణి' రండి భోంచేద్దురుగాని!'

'భోజనమా...నీవు తినకుండా నేనెలా తినను చెప్పు? ఈ విధంగాఒకపూట పస్తుతో ఎన్నాళ్లు బ్రతుకుతాము, చూడబోతే ప్రపంచంనుండి ఎందరోఅభినందన పత్రాలు, లేఖలు పంపుతారు. నీవు ధన్యుడవంటారు.

వాళ్ల పరిభాషలో ధన్యత అంటే యిదే నేమో! మనపరిస్థితి ఈ విధంగా ఉంటుండి నీవు తినంది నేను తినను... నేనేమి చిన్న పిల్లవాడినా చెప్పు, తింటే ఉన్నదే యిద్దరము తిందాము'

'సరే ... లేవండి'

◆ ◆ ◆

"ఏమండీ, ఏమిటిది, బ్రతకడానికేనా, ఎప్పుడీలా రంగులతో మునిగి తేలుతుంటే ఆరోగ్యంచెడిపోదూ ?"

'అదేమిటి సుజాతా ? చిత్రం పూర్తి చేసి వెయ్యిరూపాయిలు సంపాదించాలి ఈ రాత్రికి పూర్తిచేసి రేపు తీసికొని పోతాను...'

'రాత్రంతా మేలుకుంటారా! వద్దండీ, నా మాట వినండి; అన్ని చెప్పి చేయించే వారేకాని, రేపు మూలపడితే ఎవరూ ఆదుకోరు ... నేనూరుకోను, నా మాట వినండి, మీపాదాలుపట్టుకుంటాను, ఎంతో చిక్కిపొయ్యారు, నేనేం పాపం చేశానండి నా మాట వినకుండా ఉండటానికి...'

'తప్పు సుజాతా! నాకు మాత్రం నా ఆరోగ్యం కాపాడుకోవాలని లేదా! ఎన్ని రోజు లీలా అర్ధాకలితో జీవిస్తాంచెప్పు!! ఈ చిత్రాన్ని పూర్తిచేసి మన ఆకలి తీర్చుకోవాలనేగాని ... ఏడవకు సుజాతా ... ఈ దౌర్భాగ్యుని కట్టుకున్నతరువాత ఈ మాత్రానికే ఏడుస్తే...'

'ఆగండీ, బాధపడ్డారా, క్షమించండి... సరే! కానీయండీ నేనుగూడా మేలుకుంటాను, చిత్రం పూర్తిచెయ్యండి.'

రాజు తన చిత్రాన్ని పూర్తిచేశాడు, ఇక దృష్టి పెట్టటము మాత్రమే మిగిలింది, సుజాత ముఖంలో చిరునవ్వు మెరిసింది, నెమ్మదిగా మెడచుట్టూ చేతులుచుట్టి ముఖంలో ముఖంపెట్టి' ... ... నిజంగా యింత చక్కగా ఏలా వ్రాశారు, మీరు గొప్ప చిత్రకారులు.'

"ఓహో - నీవుకూడా అభినందనల నేనా,...యింకా ఏమన్నా ఇస్తావను కున్నాను" అంటూ ఆమెను బాహులతా పంజరంలో బంధించాడు, విధాత తిన తిండిలేని నవదంపతుల మధ్య అనురాగ ప్రవాహాన్ని కల్పించి ఈ జీవిత నాటకాన్ని రక్తి కట్టిస్తాడు కాబోలు! లేకపోతే సిరీష సుమబాల సుజాత ఏజమీందారీ కుటుంబంలోనో ఉండవలసిన యువతి. ఆమెకు సౌందర్యం, సౌశీల్యం రెండూ ఉన్నవి. యిక రాజు, ప్రపంచ ప్రసిద్ధి వడసి నవయువక చిత్రకారుడు...

ఇంతలో ప్రమిదలో నూనె అయిపోయింది, అతని కుంచె ఆగిపోయింది, సుజాత కునికిపాట్లుపడుతూఉంది, 'సుజాతా' అన్నాడు రాజు, ఆమె లేచి దీపాన్ని చూచింది. కాని యింట్లో నూనెలేదు. 'చిత్రం పూర్తయిందిలే సుజాతా' అన్నాడు రాజు భయంతో ... ఈ సమయంలో అంతరాయం కలిగిస్తే చిత్రం చెడిపోతుం

డని తన పవిటచెరగును చించుతూ ఒత్తులుగా చేసివేసింది. చిత్రం పూర్తయింది, తెలతెలవారింది, ఆమె పవిట సగము వత్తిగా కాలిపోయింది.

◆ ◆ ◆

సూర్యకిరణాలతోపాటు రాజు ముఖంలో ఆనందరేఖలు ఉద్భవించాయి, కొద్దికాలంలోనే అతడు వెయినూట పదహార్లకు అధికారి కాబోతున్నాడు, సుజాత చిత్రాన్ని అందిస్తూ చిరునవ్వు నవ్వింది, రాజు చెయిర్ మన్ గారింటి కెళ్ళాడు, కాఫీ త్రాగి కూర్చున్న చెయిర్ మన్ దామోదరయ్య 'ఓ ఎవరూ... రాజూ... రా... చిత్రం కూడా పూర్తిచేసినట్లుందే ... నిజంగా నీవు గొప్ప చిత్రకారుడివి ... ఈ పట్టణం తరఫున నీకు సన్మానంచేద్దామనుకుంటున్నాను; అప్పుడు కనీసం వెయినూట పదహార్లన్నా గిడతయి'

రాజు కూర్చుంటూ 'చిత్రం చూస్తారా' అన్నాడు.

'చిత్రం చూచేదేమిటి ... నీవు వేస్తే యిక చూడాలా, అక్కడపెట్టు. త్వరలోనే నీకు సన్మానసభ ఏర్పాటుచేస్తాను ... సరేనా, కనపడుతూండు'

రాజుకు ఈ మాటలలోని ఆంతర్యం అర్థంకాలేదు, అతని గుండె దడదడలాడింది. కాళ్ళక్రింద భూమి క్రుంగినట్లనిపించింది, నెమ్మదిగా "మరి నా మాటేమిటండీ" అన్నాడు.

"అదే చెప్పానుకదూ, త్వరలోనే ఏర్పాటు చేస్తానన్నానుకదూ !"

"అదికాదండి ఈచిత్రం గీచినందుకూ"

"అయితే దీనికి విలువ యిమ్మంటున్నావన్నమాట"

"అవునండి – నా పరిస్తితి మీకు తెలియందికాదుగదా ! చాలా చిక్కులలో ఉన్నాను – ఎంతో ఆశతో వచ్చాను."

"అయితే డబ్బుల కమ్ముకుంటావటయ్యా నీ శక్తిని, సరిగా గీచావా, చూపించు." రాజు సంతోషంతో చిత్రాన్ని చూపించాడు.

"అదేమిటి రాజు ఆ పన్ను పెదవిమీద! వేశావు, అసహ్యంగాలేదూ !"

"అవును, మీరు ఆలానే ఉన్నారు కదండీ –"

"అట్లా ఉంటే అట్లా గీచావన్నమాట, నీ వేదో అందంగా గీస్తావనుకున్నాను, ఈ మాత్రానికే నీకు కానుక లివ్వాలా, హాయిగ ఫోటో తీయించుకోనా ? సరేలే ... నీ చిత్రంవద్దూ, ఏమీవద్దు, నేను పనుండిపోతున్నాను" అంటూ కారులో ఎక్కి వెళ్ళిపోయాడు. రాజు చిత్రంతో తన యింట్లోకి ప్రవేశించాడు. సుజాత అంతా గ్రహించింది. రాజు వస్తూన్న దుఃఖాన్ని ఆపుకుంటూ అంతా చెప్పాడు. చంటివాడిలా సుజాత ఒడిలో వ్రాలిపోయాడు, సుజాత బుజ్జగిస్తూ 'ఎందుకండీ బాధపడటం ... మన లలాట లిఖితం ఈలావుంటే వారికి మంచి బుద్ధి పుడుతుందా! కళారాధకుల జీవితాలింతేగామోసు' అన్నది సుజాత గీరబోయిన కంఠంతో.

అభివృద్ధికొరకు రచనావళి

# మహా పురోగమనం

మన ద్వితీయ ప్రణాళికలో ప్రధానంగా నొక్కి చెప్పబడ్డ విషయం అంటే, పారిశ్రామికంగా శీఘ్ర పురోగమనం, అందులో రవాణా వార్తావాహక సౌకర్యాలు అంతనే ముఖ్యమైనవి. ఎందుచేతనంటే, ఉత్పత్తి చేయబడ్డ వస్తువులు ప్రజలకు సులభంగా దొరకు ఏర్పాట్లు చేయాలి. ఈలాగ ఉత్పత్తి, పంపకం-ఇవి రెండూ ప్రణాళికయొక్క ప్రధానోద్దేశాలయి వున్నవి. కనుకనే, వానికొరకు మొత్తం అంచనా ఖర్చులలో రమారమి సగభాగం ప్రత్యేకింపబడ్డది.

## ప్రతి ఒక్కటీ ఎక్కువే

పెద్దపెద్ద యంత్రపరిశ్రమల స్థాపన మరియు లోహసంపదయొక్క ఉత్పత్తిని పెంచుటతో వస్తూత్పత్తి కూడా పెంపబడుతూన్నది. పారిశ్రామిక మరియు లోహసంపదల ఉత్పత్తికొరకు ప్రత్యేకింపబడ్డది మొత్తం రూ. 890 కోట్లు (ప్రణాళిక అంచనా మొత్తంలో నూటికి 19-వ వంతు). గ్రామీణ పరిశ్రమలు మరియు చిన్నపరిశ్రమలు ఇందులో చేరినవే. ద్వితీయ ప్రణాళికయొక్క ఉద్దేశాలలో అధికోద్యోగావ్యాప్తి చాలా ప్రధానపాత్ర వహిస్తున్నది. అనగా, వ్యవసాయంలో కాక, 80 లక్షల మందికి ఉద్యోగాలు దొరకగలవని ఆశింపబడ్డది.

## సర్వసమృద్ధి కనుచూపులో ఉంది

పరిశ్రమల సర్వతోముఖాభివృద్ధితో ఉత్పన్న వస్తువుల పంపక సౌకర్యాలుకూడా పెరుగుతాయి. ద్వితీయ ప్రణాళికకొరకు అంచనావేయబడ్డ మొత్తం ఖర్చులలో రవాణా, వార్తావాహక సౌకర్యాలు, అనగా, రైళ్ళు, బాటలద్వారా రవాణా సౌకర్యాలు, ప్రవాసానుకూల్యాలు, నౌకా, విమాన ప్రయాణాభివృద్ధి, వార్తాప్రసార పెంపకం, టపాలా తంతి సౌకర్యాలు ఇత్యాదుల విస్తృతికొరకు ప్రత్యేకింపబడ్డది రూ. 1,385 కోట్లు. ఈ మొత్తం, ప్రణాళిక మొత్తం అంచనాలో నూటికి 29-వ వంతు అవుతుంది.

## ద్వితీయ పంచవర్ష ప్రణాళిక రాష్ట్ర పురోభివృద్ధికొరకు



# తెల్లరోజా!


| రచయిత్రి : | అనుసరణ : |
|---|---|
| ఇన్‌గే షోల్ | డాక్టరు వి. ఎస్. శర్మ |


[మొన్నటి దారుణ ప్రపంచయుద్ధకాలంలో జర్మను దేశానికి, జర్మను సంస్కృతికి, తీరని అప్రతిష్ఠను తెచ్చిన - నాయకుల అమానుష చర్యలని ప్రతిఘటించటానికి "తెల్లరోజా" ఉద్యమాన్ని ధైర్యసాహసాలతో నడిపినవారు ఆరుగురు మాత్రమే. వారిలో ముగ్గురు విద్యార్థులు. నాలుగవవారు ఒక విద్యార్థిని - ఆ విద్యార్థులలో ఒకరి సహోదరి. అయిదవవారు యూనివర్సిటీ ప్రొఫెసర్. ఆరవవారు ప్రొఫెసర్‌గారి సతీతిలకము. రష్యను యుద్ధరంగంలో జర్మను సైనికులు ఒకటిన్నర సంవత్సరం హోరాహోరిగా పోరాడినా చుక్క ఎదురైంది. రంగభూమిలో లక్షలసంఖ్య హతమైంది. ఇండ్లకు తిరిగివస్తూవున్న సైనికదళాల్లో మరికొన్ని లక్షలు చలిబాధకోర్వలేక నాశనమయ్యాయి. ఈ సంగతి జర్మను దేశీయులకి బొత్తిగా తెలియదు. ప్రభుత్వం చేస్తూవున్న అబద్ధాల ప్రచారంలో ఈ సత్యం ప్రజానీకానికి ఎలా తెలుస్తుంది?...ముగ్గురు విద్యార్థులూ ఆ యుద్ధరంగంలో వినని, కననీ దృశ్యాలని చూశారు. దేశీయులకి వున్న సంగతులు చెబుతూ వాళ్లని ఈ దారుణావస్థలోనుంచి రక్షించాలని, తద్వారా దేశపు కీర్తి ప్రతిష్ఠలని నిలువబెట్టాలని పట్టుపట్టారు. వారి సాహసకార్యాలను గురించి ఇక చదవండి.]

## 1

## దేశంలో అలజడి!

అటు రాజ్యాంగ తంత్ర శాస్త్రంలో, ఇటు తత్త్వ శాస్త్రంలో, వాటి రెంటినీ సమన్వయపరచటానికి శాయశక్తులా ప్రయత్నిస్తూవుండే మత శాస్త్రంలో ప్రజాకోటికి శాశ్వతానందాన్ని ప్రసాదించటానికే సంఘం అనేది తలఎత్తిందనీ, ఈ సంఘాన్నే అనాదినుంచీ ప్రభుత్వం అని మన పూర్వులు పేర్కొంటూవుండేవాళ్లనీ మనం చిన్ననాటినుంచీ ఇంట్లో, స్కూళ్లలో, మరి ఇతరచోట్లా నేర్చుకుంటూనే వున్నాం. అలాటి ఆదర్శాలూ, ఆశయాలు ఎంతో వున్నతమైనవి. జీవితపరమావధికి అలాటి గొప్ప గొప్ప మాటలు ఎంత లాభదాయకాలో! వూరక వుత్తమాటలతో చెప్పుకుంటూ ఆనందిస్తూవుంటే ఏంలాభం?

మనదేశం ఈ రోజుల్లో, మనం ఎప్పుడూ వినని, కననీ, విషమావస్థలో పడిపోయి ఎలాటి యమయాతనలకి లోనుగావలసివచ్చిందో ఇక మాటలతో

చెప్పాలా? పూర్వకాలంలో దేశం ఇలాటి కష్ట పరిస్థితులలోనున్నప్పుడు మన పూర్వులు ఎలాటి పద్ధతులను అవలంబించి ప్రజాకోటికి ఒక దారి తెన్నుచూపి ధన్యత గాంచారో దేశచరిత్రలో చదువవచ్చు. మతగ్రంథాలూ అలాటి మహనీయులను వీరాధివీరులుగా ప్రశంసిస్తూ వ్రాసిన వాక్యాలను మననంచేస్తూ గర్వించవచ్చు.... కాని యీ రోజుల్లో, ఈ చీకటి రోజుల్లో మన యోగక్షేమాలకోసమే ఈ రాజ్య చక్రాన్ని నడుపుతూ వున్నామని జయనాదాలనుచేస్తూ, అసలుకే పెద్ద మోసాన్ని తెస్తూవున్న ఈ నాయకులు ప్రజా తత్త్వంలోని నిజశక్తిని ఎప్పుడు గ్రహించగలుగుతారో? వాళ్లు ఆ సంగతి గ్రహించలేని స్థితిలో వున్నారు. అంచేతనే ప్రజాకోటిని వాళ్ల అదుపాజ్ఞల్లో, వాళ్ళకి నచ్చిన పద్ధతుల్లోనే వుంచుకుంటూ ఆ బాలగోపాలాన్ని క్షోభ పెడుతూ వున్నారు. తాము చేస్తూవున్నపని ఎంతో మంచిదనీ, వున్నతాశయాలతో నిండినపని అని ఈ నాయకులు చంకలు కొట్టుకుంటూ వున్నారు. నాయకులకన్నా రెండు ఆకులు ఎక్కువ చదివినవాళ్లే, వాళ్ళ తాబేదారులు, - మంత్రులూ, ప్రభుత్వాధికారులూ, చిల్లర మల్లర వుద్యోగస్థులూ! - నాయకులుచూసి రమ్మంటే, వీళ్ళు ... కాల్చివస్తేనేగాని తృప్తి అనేది, సంతోషం అనేది ఎలాగు వుంటుంది? కాలం కలికాలం—కలిపురుషుడే వీళ్ళ రూపాలతో ఈ తాండవాన్ని చేస్తూవుంటే, ఇక ఇతర్లు ఇలాటి అవస్థనుంచి ప్రజాకోటిని రక్షించటానికి ఎంత సాహసం చేయాలో వుత్త మాటలతో చెప్పాలా? ఒక సాహసమేకాదు, త్యాగమూ, సంపూర్ణ త్యాగమూ, అలాటి ధీమంతులనుంచి అవసరం. అత్యవసరం. ...

ప్రజకి, వాళ్లు భాగ్యవంతులు కానీయండి, బీద సాదలు కానీయండి, పట్నవాసులు కానీయండి, గ్రామవాసులు కానీయండి ... వాళ్ళ కందరికీ ఈ సంక్షోభ కాలంలో అత్యవసరంగా కావాలసింది శాంతి. ఇంట్లో శాంతి. బయట శాంతి. అలాటి శాంతి వాళ్ళకేకాదు, వాళ్ళ పరమ శత్రువులని మనం పిలుస్తూవున్నవాళ్ళకీ ఆ శాంతి కావాలి. అప్పుడే ప్రజాకోటి కుదటబడుతుంది. దేశం బాగుపడుతుంది. చుట్టు ప్రక్కల దేశాలూ శాంతి సుఖాలను తనివితీరా అనుభవిస్తూ ధన్యతగాంచ కలుగగలుగుతాయి...

2

## సత్యాగ్రహం!

కాని ఆ పనిని ఆరంభించటానికి ఎవడు ముందుకు రాగలుగుతాడు? అధికారులకి వాళ్లు చేస్తూవున్న మహోపకారాన్ని స్పష్టంగా ఎవడు చెప్పగలుగుతాడు? అలాటిపనికి ముందంజ వేయటం అంటే అలాటి వ్యక్తి సత్యాగ్రహాన్నే అదురూ బెదురూలేకుండా అవలంబిస్తూవున్నవాడన్నమాట. ఆధునిక నాగరీకతా వాతావరణంలో పుట్టి పెరిగిన వ్యక్తులు ఇలాటి ప్రతిఘటనకి పూనుకోవడమంటే ఆ వాతావరణం మనకి ప్రసాదించే అష్టకష్టాలని సంతోషపూర్వకంగా అంగీకరించటానికి సర్వావస్థల్లో సంసిద్ధులై వుండాలి.

జర్మను వ్యక్తులలో ఇలాటి వున్నతాశయాలూ, ఆదర్శాలూగలవాళ్లువున్నారు. ఎంతోమంది వున్నారు. కాని అలాటి మహనీయులు ఇలాటి సత్యాగ్రహోద్యమంలోచేరి పనిచేయమని ఇతర్లతో చెప్పక, అలాటి ఆశయాల్లో నమ్మకంగలవాళ్లు, ఒకరిద్దరు నడుముకట్టి ముందంజవేయాలి. తుపాకులకి గురికావాలసివచ్చినా, లేదా అంతకన్నా మించిన యమయాతనలకి ఆహుతి కావాలసివచ్చినా తయారుగా వుండాలి. ఇతర్లు ఇలాటి పనులు చేసేవాళ్ళనిచూసి అదరిపోవచ్చు. ... కాని అలా భయపడటం తాత్కాలికం. క్రమేణ నిజతత్త్వాన్ని తెలుసుకుంటారు. అదురూ బెదురూ లేకుండా ముగించాలసిన పనినంతా ముగించి కీర్తికాయులుకాగలరు. ... ప్రజాశాంతి, తద్వారా దేశాభ్యుదయానికి అత్యవసరమైన దేశ స్వాతంత్ర్యం ఇలాటి పంథాలోనే మనం నడుస్తేనేగాని మనకు లభించదు. ...

3

## అబద్ధాల ప్రచారం!

జర్మను సేనలు రష్యను యుద్ధరంగంలో పడుతూవున్న దుర్భరావస్థని మాటలతో చెప్పాలా! అందరి

వూహా రష్యాను అతి సులభంగా మింగివేయగలమనే. నాయకులు వాళ్ళకి అలా బోధించారు. వాళ్లు దాన్ని తూ.చా. తప్పకుండా నమ్మారు.

రష్యా ఇలాటి ఆటలను తన చరిత్రలో ఇంతకు ముందు ఎన్నోసార్లు చూసింది. ... అలాటి జగన్నాటకమే మరొకసారి ఆడబడుతూ వున్నదని, దాని ఫలితం ఏ విధంగా అనుభవంలో వుంటుందో కూడా బాగా తెలుసు. అంచేత జర్మనులు ఒక ఎత్తు వేస్తూవుంటే, రష్యాదేశం దానికి మించిన పైఎత్తును వేస్తూవుంది. ఆ నాటకం మూల్గా నా రష్యనులు దెబ్బలు తింటూ వున్నారు. వాళ్ళ దెబ్బలకన్నా మించినవి ఆ రోజుల్లో జర్మను సైనికులు చలి మూలాన, ఆకలి మూలాన అనారోగ్యం మూలాన అనుభవించాలసివచ్చిన యమయాతనలు ఇన్ని అన్ని అని అనాలా? హాన్స జర్మను సైనికులకీ వైద్యుడిగా వుపచారంచేస్తూ ఈ నాటకాన్నంతా కళ్లారచూస్తూ కుమిలిపోతూవున్నాడు. ఇటు గోయి, అటు నూయి. అలా ఈ బాధనుమాసి కుమిలిపోతూ వున్నా ధైర్యసాహసాదులను మన్నుపాలు చేసుకొనలేదు. రాత్రింబగళ్లూ ఇలాటి అవస్థనుంచి ఇటూ తన దేశాన్ని అటూ ఆ పరాయి దేశాన్ని రక్షించటానికి ఎలాటి పద్ధతి నవలంబిస్తే ఇరుప్రక్కలా శాంతి శాశ్వతంగా వుండిపోగలదో తలపోయసాగాడు. హాన్స జీవిత దృక్పథమే ఆ నాటినుంచి పూర్తిగా మారిపోయిందనే చెప్పినా అందులో తప్పేమీవుండదు. ఆ చలిలో, ఆ గాఢాంధకారంలో ... ఇదే హాన్సకు చెప్పరానంత శక్తిని, సాహసాన్ని, ప్రసాదించింది. ఆ చీకటిలో ... హాన్స వెలుగును చూశాడు. స్వాతంత్ర్య లక్ష్మిని దర్శించి పునీతుడయినాడనే అనవచ్చు. అంచేత హాన్స తను అవలంభించాలనుకున్న పద్ధతిని చక్కగా తెలుసుకున్నాడు.

చీకటిలోనుంచే వెలుగు చీల్చుకుని వస్తుంది. ఇది వెలుగుకి సహజ ధర్మం. అలాగే ప్రజాజీవితం కూడా. ఈ కష్టాలు త్వరలో మాయమవుతాయి. శుభోదయం వస్తుంది. ... కాని అలాటి దివ్యోదయానికి అవసరమైన వాతావరణాన్ని సృష్టించే బాధ్యత తను తనమీదే వేసుకోవాలని వుత్సాహపడసాగాడు హాన్స. తను అచ్చట చేస్తూన్నది వైద్యోపచారం. రాత్రింబగళ్లు విధివిరామం అనేదేలేక రోగులు, అనేక యుద్ధ బాధలకు గురియైనవాళ్లు తన దగ్గరికి వస్తూవుండేవాళ్లు. వాళ్ళని చూస్తూ వున్నాక, వాళ్ళకి శాయశక్తులా సేవచేస్తూ వాళ్ళ బాధను తగ్గిస్తూవున్నాక, హాన్స తన దీక్షను ఎలా సక్రమంగా నిర్వహించుకోవాలో సులభంగా తెలుసుకున్నాడు. దాన్నే నిర్భయంగా నిర్వహించాలి. ఆ సమయం ఎప్పుడు వస్తుందో? ఆ శుభసమయానికే కలవరిస్తూవున్నాడు యుద్ధరంగంలో వున్నంత కాలమూ. ...

రష్యను రంగాన్నుంచి జర్మను సేనలు ఇళ్ల దోవ బట్టాయి. యుద్ధ రంగంలో లక్షలకొలది సేనలు హతమయ్యాయి. ఇళ్లకి వస్తూ దోవలో అంతకు మించిన సంఖ్య ప్రాణాలని కోల్పోవాలసి వచ్చింది. ... ఆ సంగతి దేశంలో వుండి పోయిన వాళ్లకి ఎలా తెలుస్తుంది? యుద్ధప్రచారం తీవ్రంగా సాగి పోతూ వుంది. అమాయకపు జనం జయం అంతా మనదే అని వెర్రి వెర్రి భ్రమల్లో పడి పోయారు ... ...

హాన్స ఇతర సైనికులకిమల్లె ఇంటికి వచ్చాడు. అంతకు ముందు చూసిన హాన్స వేరు, ఇప్పుడు మా ఇంట్లో మేమంతా చూస్తూవున్న హాన్స వేరు. యుద్ధ రంగంలో హాన్స గడపిన కాలం 18 నెలలు మాత్రమే. వయస్సులో హాన్సకి 25 లు మించలేదు. కాని ఆ ఆకారాన్ని ఇప్పుడు చూస్తేనా! ... ... ఎంత మారిపోయాడు. యుద్ధ రంగంలో ఆ పద్దెనిమిది నెలలూ హాన్స చూసిన దృశ్యాలూ, ఎదుర్కొన్న సంఘటనలూ సామాన్యమైనవి అయితేగా! ...... ఇంట్లో వున్నంతకాలమూ ఆ సంగతులను రాత్రింబగళ్లు చెప్పటానికి హాన్సకి విసుగు అనేది వుంటే కదూ? మా వూళ్లో హాన్సకి ఎంతో మంచి స్నేహితులు వున్నారు. వాళ్లని కలుసుకొనటానికి అడపా

దడపా వాళ్ళఇళ్లకు వెడుతూవుండేవాడు. వాళ్ళకి తన అనుభవాలని విధి విరామంలేకుండా చెబుతూ వాళ్ళనీ కార్యరంగంలోకి నడిపించటానికి హాన్స్ వాళ్ళకి ఇచ్చిన వుత్సాహాన్ని ఇక చెప్పాలా! ... ...

4

## కరపత్రాలు!

సెలవులు ముగిశాయి. ఇంతవరకూ ఆకారణం మూలానో ఈ కారణం మూలానో మూసివేసిన యూనివర్సిటీని తెరిచారు. అదేగా ఈ సందిగ్ధావస్థలో హాన్స్‌కి కావలసింది. ఇంకొక సంవత్సరపు చదువుని పూర్తిచేస్తేనేగాని హాన్స్ డాక్టర్ చదువు పూర్తికాదు ... ... యూనివర్సిటీ తెరిచేరోజుకి ముందటి రోజే హాన్స్ మ్యూనిచ్ నగరానికి చేరుకున్నాడు. చెల్లి సోఫీ అన్నయ్య వెంట తన చదువు కొనసాగించటానికి ఆ నగరానికి చేరుకుంది. వాళ్ల స్నేహితులు క్రిస్టల్, అలెగ్జాండర్, విల్లి, ఆ సమయానికే మ్యూనిచ్ నగరంలో వాళ్ల చదువులను పూర్తిచేసుకొనటానికి తయారయ్యారు. వాళ్లకు హాన్స్ కొత్తవాడైతేగా? హాన్స్‌కు వాళ్లు అంతేగా!... ...

వాళ్ళ ప్రొఫెసర్ వాళ్లు యుద్ధరంగాలకి వెళ్ళడానికి ముందు ఆయన్ని కలుసుకున్నప్పుడు ఇచ్చిన సలహా వాళ్ళందరికి బాగా తెలుసుగా! అప్పుడే ప్రొఫెసర్ దగ్గర విద్యార్థులు ప్రమాణం చేశారు, ఎలాటి కష్టనిష్ఠూరాలకు లోనుగావలసివచ్చినా ఆయన ఇచ్చిన సలహాని తూ. చా. తప్పకుండా కార్యరూపాన పెట్టటానికి సిద్ధంగా వున్నామని. ఆ పరీక్షా సమయం ప్రారంభమైంది వీళ్ళంతా యూనివర్సిటిలో తిరిగి చదువులని ప్రారంభించిననాటికి.

హాన్స్, సోఫీలు బస చేస్తూవున్న చోటికి సమీపాన్నే మాకు తెలిసిన చిత్రకారుడు నివసిస్తూవుండేవారు. ఆయన ఆశయాలూ మా వాళ్ళ వాటి వంటివే. ఆయన నివసించే ఇల్లు రాజబాటలోనే వున్న పెద్ద లోగిలికి వెనుక భాగంలోవున్న తోటలోవుంది. ఆయన యుద్ధరంగానికి వెళ్లాలసి వచ్చింది. హాన్స్‌ను, వాళ్ళ స్నేహితులను తను తిరిగి వచ్చేటంతవరకు తన ఇంటిని వాళ్ళ చదువులకు వాడుకుంటూవుండమని కోరాడు. అంచేత హాన్స్, వాళ్ళ మిత్రబృందమూ సర్వసాధారణంగా ఆ తోట ఇంట్లో సమావేశమవుతూ వుండేది. వాళ్ళ ప్లాన్లను ఎలా కార్యాచరణలో పెట్టాలో ప్రతిరోజూ చర్చిస్తూవుండేవాళ్లు ...

ఇప్పుడు వాళ్లు చేయాలసినపని, ప్రభుత్వంవారు ఒక వైపునా, ప్రభుత్వంవారి అడుగుమడుగుల్లోనుండి పోయినవాళ్లు మరొకవైపునా, దేశపరిస్థితులను గురించి చేస్తూవున్న ప్రచారాన్ని అన్ని విధాలా ప్రతిఘటించటం. ఆ పని సామాన్యమైనది అయితే కదూ? ప్రజాకోటి దేశము అనుదినమూ ఎదుర్కొంటూవున్న సంఘటనలను చక్కగా తెలుసుకోవాలి. ఆ సంఘటనలనుంచి ఒక దారీ తెన్నును గుర్తించటానికి సాహసంచేయాలి. అలా చేయటానికి భయపడ్డారా దేశానికి ఎంత అప్రతిష్ఠను తీసుకునివచ్చినవారవుతారో తెలుసుకుని తీరాలి. ఈ పనిని సాధించటానికి కరపత్రాలను తయారుచేసి, దేశమంతటా, వాళ్ళకి నచ్చిన మార్గాన పంచిపెట్టటానికి నిశ్చయించుకున్నారు. ఆ పని ఎంత కష్టభూయిష్టమో ఇక చెప్పాలా? రహస్యంగా చేయాలి. కరపత్రాన్ని ప్రప్రథమం తయారుచేయాలి. ఇలాటి సంగతులను జనాంగానికి తెలుపాలి. ప్రభుత్వం ప్రజలకు తెలుపుతూవున్న అబద్ధాలను సూటిగా ఖండించాలి. దేశంపేరుతో, ప్రజల పేరుతో, సంస్కృతిపేరుతో ప్రభుత్వం జర్మను ప్రజాలోకానికి తీసుకునివస్తూవున్న అప్రతిష్ఠను జనం అవగాహనంచేసుకోవాలి. ఒకసారి నిజం బయటపడ్డదా, ఇక బండి సూటిగా నడుస్తుంది. ఆ పనికి అత్యవసరమైన వాతావరణాన్నే సృష్టించటానికి ఈ కరపత్రాలు మార్గదర్శకంగా వుండాలని హాన్స్, వాళ్ళ మిత్రబృందం వుబలాటము.

రాత్రిపూట మిత్రులంతా ఈ ఆర్టిస్టు ఇంట్లో

సమావేశమవటం, వ్రాసిన కరపత్రాన్ని డూప్లికేటర్ యంత్రంమీద అచ్చువేస్తూ వేలకొలది ప్రతులను తయారుచేయటం. ... ఆ ఇంటికి చుట్టు ప్రక్కల ఇళ్లు వున్నాయి. ఎంతోమంది వాటిలో బసచేస్తూ వుంటారు. వాళ్ళ బసల్లోనుంచి ఈ తోటలోవున్న ఇంటిని చూడవచ్చు. ... రాత్రిపూట అక్కడికి చేరుకోనటం, చుట్టుప్రక్కల్లోనున్న నరప్రాణికీ తెలియకుండా చీకట్లో తమ కార్యక్రమాన్ని సాగిస్తూవుండటమూ వీళ్ళకి మామూలు పద్ధతి అయిపోయింది. ... కాని అంతా సక్రమంగా జరిగిపోతూవున్నదని భ్రమపడటం తప్పు. వేయి కళ్ళతో ఆ పని చేస్తూవున్న కాలంలో పరిసరాలన్ని చూస్తూ వుండాలి. గోడలకి చెవులున్నాయి. ఆ చెవులూ వాళ్ళ పనిసందడిని గుర్తించకుండా వుండటానికి అవసరమైన కట్టుదిట్టాలను ప్రతి నిమిషమూ చేస్తూనే వుండాలి. ... ఈ సాధనకి ఓపిక వుండాలి. ఎంత ఓపిక అవసరమో ఇక మాటలతో చెప్పటం అవసరమైతేగా !

ఆనాటికి చేస్తూవున్నపని పూర్తి అయ్యాక, తయారైన కాపీలను ఎంతో జాగ్రత్తతో దాచాలి. ఆ రాత్రి ఆ ఇంట్లో సమావేశమయ్యామనే సంగతి పరాయివాళ్ళకి తెలియనీయకుండా వుండటానికి ఎలాంటి కట్టుదిట్టాలు చేయాలో, వాటిని తూ.చా. తప్పకుండాచేసి బయటికి నడవాలి. ఏమాత్రం పొరపాటు జరిగిందా ఎలాంటి విపరీతపు సంఘటనలకి తయారుగా వుండాలసివస్తుందో హాన్స్‌కి బాగా తెలుసు. మిత్రకోటికీ చక్కగా తెలుసు. అంచేత ప్రతిరోజూ వాళ్లు ఎంత మెలకువతో ఈ కార్యాన్ని కొనసాగిస్తూ వున్నది ఇక మాటలతో వివరించటము అనవసరముకదూ ? ...

కరపత్రాల్ని అచ్చువేసినంతనే వాళ్ళపని అంతా పూర్తిఅయినట్లు ఎలా అవుతుంది ? వాటిని అతి జాగ్రత్తతో ఆ నగరంలో పంచిపెట్టాలి. ... ఆ నగరంలో ఈ పనిచేస్తే వాళ్ళ ప్లాను ఎలా పూర్తి అవుతుంది ? దేశమంతటా ఈ కరపత్రాలకు ప్రచారం జరగాలి. ...

ఎక్కడచూసినా గూఢచారులే. వాళ్ళవి వేయి కళ్లు. ఆ కళ్ళనుంచి తప్పించుకుంటూ ఈ క్లిష్ట కాలంలో ఇక్కడా, అక్కడా, పగటిపూటా, రాత్రిపూటా, ఈ వేషంలో, ఆ వేషంలో సంచారం చేస్తూ ఈ కార్యాన్ని సాధించటం ఎంత కష్టభూయిష్టమయిందో ఇక చెప్పటమెందుకు ? ...

ఈ మిత్ర బృందం ఈ పనిని సాధించటానికి చూడాలసిన గ్రామాలను, పట్నవాసాలను చూశారు. గూఢచారులు ఒకఎత్తువేస్తూ వాళ్ళని పనికట్టడానికి ప్రయత్నిస్తూవుంటే, ఆ ఎత్తులను మించిన పైఎత్తులను వేస్తూ, ప్రాణానికీ తెగించి అచ్చువేసిన కరపత్రాలను అన్ని చోట్లా పంచిపెడుతూ సాధించాలసిన కార్యాన్ని అచంచలదీక్షతో సాధించారని చెప్పిన చాలు. ...

తెల్లవారిలేచి చూసేటప్పటికి రాజవీధుల గోడల మీద ఈ కరపత్రాలు ప్రత్యక్షము. ఏ విద్యాలయం ఆవరణంలో చూసినా, ఏ కాలేజిక్లాసు రూముల్లోని బోర్డులమీద చూసినా ఇవే. అవి ఇలాంటి చోట్లకి ఎలా వచ్చాయి ? ఎవళ్లు తెచ్చి అంత నిర్భయంగా అతికించారు ? ... ఇదే పోలీసుల్ని కలవరపెడుతూ వున్న ప్రశ్న ! విద్యాధికార్లను భయకంపితులను చేస్తూవున్న సమస్య; దీన్ని ఎలా తేల్చటమనేదే ! నయాన భయాన ఇరుగు పొరుగులలో నున్నవాళ్ళని అడిగారు. ... కాని ఎవళ్ళు జవాబిస్తారు ? వాళ్ళకి ఆ సంగతి తెలిస్తేగా జవాబనేదాన్ని ఇయ్యటానికి ? ...

———○———




ఆంధ్రుల కళాసంపద సునసేవుని కథాకాలం నాటిది. అంటే అది ఇతరేయ బ్రాహ్మణము కంటె పూర్వపుది. ఆంధ్రులు విశ్వామిత్ర మహర్షి యొక్క అగ్రసుతులలో ఒకరైన ఆంధ్రుని సంతతి వారు. ఒక ప్రాచీన మహర్షి యొక్క వంశీయులు కావడం వల్ల ఆంధ్రులు సహజంగా ఆర్యజాతికి చెందిన వారు. ఉత్తర భారతంలో నివాసం ఏర్పర్చుకున్నారు. తూర్పు దక్కనులో తొలిసారిగా రాజ్యాన్ని స్థాపించి ఆ ప్రాంతంలోని తెలింగులు, కళింగులను లోబరుచుకొన్న ఖ్యాతి ఆంధ్రులకే దక్కింది.

ఉత్తర భారతంనుంచి దండు వచ్చిన ఈ ఆంధ్రులు ఉత్తమ సంస్కృతీ నాగరికతలను దక్షిణ ప్రాంతానికి కొని తెచ్చారనే విషయాన్ని అంగీకరిస్తే దక్షిణ భారతంలోని పాలిత ప్రజలు కూడా జాతి ఉన్నతికి బహుముఖంగా సేవ చేశారనక తప్పదు. ఆంధ్రులలో అనేక తెగలున్నాయి. వారిలో శాతవాహనులు ముఖ్యులు.

ఆంధ్రులలోని అస్సాకులు, మూలకులు అనే రెండు తెగలవారు గోదావరి ప్రాంతంలో తొలి వలసలను ఏర్పాటు చేసుకొన్నట్లు సుట్టెంపుట్ట అనే బౌద్ధగ్రంథానికి లిఖించబడిన వ్యాఖ్యానంలో వివరించబడింది.

ఆంధ్ర దేశం కోయిలలకు నిలయమనీ, తెలుగు భాష ప్రాచ్యభాషలలో మధురమైనదని అనడం వాస్తవాన్ని వివరించడమే గాని అభివందనలు చెప్పడం కాదు. ఆంధ్ర దేశంలోని కవితారీతులకు భారత దేశంలోని యితర ప్రాంతాలు సాటి రావంటే అతిశయోక్తి కాదు.

ఆంధ్ర భాషకు అతి సున్నిత భావాలను సైతం మధురంగా వ్యక్తం చేయగల శక్తివున్నది. నన్నయకు పూర్వపు కవుల వద్దనుండి ఆధునికుడైన గురజాడ మహాకవి వరకూ గల అందరు కవులూ కవితా కన్యకు అపూర్వమైన సేవచేశారు. ప్రాచీన కాలంలోని తెలుగు భాషపై ప్రాకృతం సంస్కృతభాషల ప్రభావం, ఆధునిక తెలుగు భాషపై పర్షియన్, ఉర్దూ, ఆంగ్ల భాషల ప్రభావం స్పష్టంగా కన్పిస్తుంది.

దక్షిణ భారతానికి మొట్టమొదట వలస వచ్చిన శాతవాహనుల ఆస్థానభాష ప్రాకృతం. సారస్వత గ్రంథాలలో కూడా ప్రాకృతమే వుపయోగించబడేది. క్రీస్తు అనంతరం ఐదవ శతాబ్దానికి చెందిన బౌద్ధ వ్యాఖ్యాత బుద్ధఘోషుడు ఆంధ్ర దేశంలో వేదములు ఆంధ్రభాషలో అధ్యయనం చేయబడేవని పేర్కొన్నారు. అది సంస్కృత ప్రాకృత తెలుగుభాషలకు భిన్నమైనది. ఆ భాష యొక్క ప్రవాహం కొన్ని తెలింగ పదాలతో ప్రారంభమై, ప్రాకృత పదాలను జతపరచుకొని, మార్గమధ్యంలో అనేక యితర భాషా పదాలను సమ్మిళితం చేసుకొని బ్రహ్మాండమైన వెల్లువగా మారింది. ఏడు, పదకొండవ శతాబ్దాల మధ్య వాడుకలో వున్న తెలుగు భాష, తొలిసారిగా ఆంధ్ర మహాభారతంలో గ్రంథస్థమైన తెలుగు భాష. అనేక భాషల యొక్క సమ్మిళితమే. వివిధ భాషలలోని మంచి పదాలను ఆమోదకరమైన పదాలను స్వీకరించి సరళమైన భాష రూపొందించబడింది. ఆంధ్ర సారస్వత సంపద యొక్క ఉజ్వలత్వానికి ఈ భాషే ప్రధాన సాధనం. అతి ప్రాచీన కాలంలోనే ఆంధ్ర దేశం నాలుగు రాజకీయ మండలాలుగా విభజించబడినట్లు చరిత్ర చాటుచున్నది. గోదావరీ, పెన్నానదుల మధ్యగల ప్రాంతం; తూర్పు ఆంధ్ర; పశ్చిమ ఆంధ్ర

ప్రస్తుత రాయలసీమ, తెలంగాణా, కళింగ. ఈ నాలుగు ప్రత్యేక మండాలల మండలాలను సుసంఘటిత పరిచి ఏకం చేయడానికి ఆంధ్ర పాలకులను, రాజకీయ దక్షులకు నిరంతర సమస్యలయింది.

ఆంధ్రదేశమంతా ఏక ప్రభుత్వం క్రిందకు తీసుకు రాబడిన సందర్భాలు లోగడ చరిత్రలో మూడు వున్నాయి. క్రీస్తు పూర్వం 235 నుంచి క్రీస్తు తర్వాత 230-వ సంవత్సరంవరకూ, గల శాతవాహనుల కాలంలోను, తర్వాత క్రీస్తు తర్వాత 1200 నుంచి 1323 వరకూ కాకతీయుల కాలంలోను, మూడవ సారి గోల్కొండ సుల్తానుల కాలంలోను రాజకీయంగా ఆంధ్రులుసుసంఘటిత పరచబడ్డారు.

ఆంధ్రదేశంయొక్క నైసర్గిక స్వరూపమే ఆంధ్ర కళా సంపదను తీర్చిదిద్దడానికి విశేషంగా కారణమైంది. బంగాళాఖాతంనుంచి అరేబియా సముద్రము వరకూ, నర్మదా - మహానదులనుంచి పెన్నా-భద్రానదులవరకు ఆంధ్ర సామ్రాజ్యం విస్తరించింది. పశ్చిమప్రాంతంలోని ప్రతిష్టానపురం, తూర్పు ప్రాంతంలోని అమరావతి రాజకీయ రాజధానులేగాక వాణిజ్య కేంద్రాలుగాకూడా రాణించాయి. కొంకణ తీరంలోని సోపరా, బారుకచ్ఛ రేవులద్వారా పర్షియనులయొక్క, యవనులయొక్క ప్రభావం ప్రసరించింది. కర్నాటక తీరంలో కళింగపట్నం, మచిలీపట్నం మూలనుంచి ఆంధ్రుల వైభవం విశాల భారతదేశంలోకి వ్యాపించింది. సమకాలీన సారస్వతం వ్యాయామాఖ్యానగల తక్షశిల, మధ్య భాగంలోని మధుర, ఈశాన్యంలోని నలందలనుంచి అమరావతికి వ్యాపించి, అటునుంచి కంచీపురం, ద్వారసముద్రాలకు విస్తరించింది. ఆ విధంగా ఆంధ్రదేశం వివిధ జాతులకు, భిన్నమైన భావలకు, వేర్వేరు రాజకీయ వర్గాలకు, విభిన్న సిద్ధాంతాలకు కూడలి అయింది. పలురకాల భాషలు సాహిత్యాల మధనంతో అమృతప్రాయమైన ఆంధ్రకళ, ఆంధ్ర సంస్కృతి అవిర్భవించాయి. ఈ కళా సంపదను పెంపొందించడానికి ఆంధ్రుల సహజ లక్షణాలు విశేషంగా తోడ్పడ్డాయి. ఇచ్చి పుచ్చుకొనే పద్ధతి ఆంధ్రులకు వెన్నతో పెట్టిన విద్య.

ఆంధ్రుల కళా సంపద గర్వించదగ్గది. దానిని సక్రమంగా గ్రహించి అది తెరమరుగున పడకుండా పరిరక్షించుకోవాల్సిన బాధ్యతకూడా వున్నది.

# వాళ్లనలా వదిలేద్దాం

శ్రీ సేమాని సంగమేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

"ప్రభాకర్ వున్నాడే - చచ్చిపోతా డనుకో మ్యూజిక్ అంటే - అందులో కర్ణాటక సంగీతమంటే మరీని!"

"అయితే"

ఈ ముక్తసరి జవాబులకి కొంచము విసుక్కొన్నట్టు గిరి ముఖంలో భావాలు చూసింది దమయంతి.

"నీవువచ్చి ఒక పాట ..." సంకోచంతో ఆగేడు గిరి.

"నా వొంట్లో బాగాలేదు అన్నయ్యా! నేను ఇప్పుడేమీ పాడలేను ..." అంది నిరుత్సాహంగా.

"అలా అంటే ఎలా చెల్లీ! అతనితో చెప్పి వచ్చేనే! వాడేమి అనుకుంటాడో- మరి నీ యిష్టం" అన్నాడు గిరి కొంచం ప్రాధేయ పూర్వకంగా.

"నువ్వెప్పుడూ యింతే అన్నయ్యా! నా సంగతి నీకు తెలుసుండికూడా విషమ పరీక్షలో పెడతావు. నేను కొత్త వాళ్లతో తిరగడంగాని, మాట్లాడడంగాని తప్పించుకుంటూ వుంటాను. అలాటిది నన్ను పాడ మని వేధిస్తే ఎలా?" అంది కొంచం ఏడుపుభీతి మొహంతో దమయంతి.

"పోనీలే చెల్లీ! నీవు పాడొద్దులే! నీవు కష్టపడడం నాకు యిష్టంలేదు! నీ వొంట్లో బాగా లేదని చెప్పేస్తాను." అన్నాడు బయలుదేరుతూ.

"అన్నయ్యా?"

ఆగేడు-చెల్లెలి మొఖం చూసేడు గిరి.

"నీవు వెళ్లు! ... ఐదు నిముషాలలో చీరమార్చుకొని వస్తాను. ఇంకెప్పుడూ ఇలా చెయ్యకు ... ఆ ... చూడు సీతను వచ్చి ఈ ఫిడేల్ కిందకితీసికెళ్లమని చెప్పు" అంది.

"అలాగే" అంటూ సంతోషంతో మేడదిగి సీతను పిలిచి మేడమీదకి పంపించేడు. ప్రభాకరరావు దగ్గరకువచ్చి యిలా అన్నాడు.

"గంధర్వగానమనుకో! నీవెప్పుడు వినలేదుగాని!" అన్నాడు గిరి ప్రభాకరరావుతో కొంచం గర్వంగా.

"ఆ! అలాగా! నేను ఎప్పుడూ విన

లేదుగా! అయినా బ్రదర్! నాకు తీరిక ఎక్కడరా? మొన్నటివరకు చచ్చేననుకో. అయినా పగవాడికికూడా వద్దురా ఈ చదువులు! మొత్తానికి M.B.B.S అయిపోయిందనుకో!"

"ప్రాక్టీసు ఎక్కడ పెడతావు?"

"ఇంకా నిశ్చయించలేదు - మూడాంతులు యిక్కడే పెడతాను. అమ్మ, నాన్న ఇక్కడే పెట్టమంటున్నారుకూడాను."

సీత ఫిడేల్ కేసు తెచ్చి బల్లమీద పెట్టి వెళ్లిపోయింది.

చీరమార్చుకొని ఒక్కసారి తన ప్రతిబింబం అద్దంలో చూసుకుంది దమయంతి! స్లిప్పర్ తొడిగి తాపిగా మెట్లుదిగి హాలు మధ్యకు వచ్చింది.

అన్నయ్య, స్నేహితుడు లేచి నిలబడ్డారు. అన్నయ్య పరిచయంచేసేడు.

"ఈమే నా సిష్టర్ దమయంతి–II year Arts చదువుతున్నాది–ఇతడే నా మిత్రుడు Dr. ప్రభాకరరావు M.B.B.S"

"నమస్తే" అన్నాడు ప్రభాకరరావు వుత్సాహంగా.

"నమస్తే" అంది దమయంతి నీరసంగా.

"నేను ఎప్పుడూ మిమ్మలను చూడలేదు! ఆ భాగ్యం ఇవాళ కలిగింది!" అన్నాడు ప్రభాకరరావు హుషారుగా.

మౌనంగా కూర్చొని ఫిడల్ కేసు క్లిప్పులు తీస్తున్నాది.

"మీరు ఎప్పుడయినా రేడియో ప్రోగ్రాములు యిచ్చేరా?" అన్నాడు ప్రభాకరరావు.

"అబ్బే! లేదండి! ఐనా నాకేమంత సంగీత మొచ్చునని..." అంది వుత్సాహంగా - మళ్ళా ఎక్కువ మాట్లాడినట్లు ఫీలయి కొంచము సమాళించుకొంది.

శ్రావ్యముగా పాడినపాటవిని తన్మయుడయ్యాడు ప్రభాకర్. పాట ఆపగానే "Marvellous,...wonderful... అమరగానం ... నిజంగా సరస్వతీదేవివచ్చి ఫిడేలు పట్టుకున్నదా అన్నట్టువుంది. ..." ఇలా తెగ పొగుడుతూ అందులో లీనమయిపోయి షేక్ హేండ్ యివ్వబోయేడు, ప్రభాకరం.

తను వెనక్కి తగ్గింది కొంచం కోపంతో! అయినా కొంచం అలుచిస్తే నెత్తిమీద కెక్కుతారు ఈ మగజాతి అని అనుకుంది అసహ్యించుకుంటూ

నాలుక కఱచుకొని "క్షమించాలి" అన్నాడు ప్రభాకరం కొంచం ఫీలయి.

"ఫరవాలేదులెండి" అంది కొంచం కోపంతో లేచింది! "వస్తాను! వొంట్లో

బాగా లేదు! అదోలా వుంది'' అని అంటూ జబాబు ఆశించకుండానే బరువుగా అడుగులు వేస్తూ మేడమీద తన గదిలోకి దారి తీసింది దమయంతి.

దమయంతి వెళ్ళిన తరువాత రెండు నిముషాలు హాలు నిశ్శబ్దంగాయుంది.

ఆ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ ప్రభాకరం ఇలా అన్నాడు. ''మీ సిస్టర్ యింత బాగా పాడుతుందని అనుకోలేదోయ్! రేడియో వాళ్లు విన్నారంటే కళ్లనద్దుకుంటారు.''

''అవవచ్చు! అయినా దానికి తగని సిగ్గు. అదీకాకుండా అది ఇలాంటివి like చెయ్యదు''

''లైక్ చెయ్యకపోవడమంటే నాకేమీ అర్థం కాలేదు! దానిలో తప్పేముంది?''

''తప్పేమీ లేదనుకో. అయినా దానిది ఒక విధమయిన వింతమనస్తత్వం!''

''అవునులే! రకరకాల మనుష్యులు-రకరకాల మనస్తత్వాలు!'' అంటూ లేచేడు ప్రభాకరం. ''వస్తా! మళ్లా కలుసుకుందాం'' అంటూ దారితీసేడు.

మేడమీద తనగదిలోకి వెళ్ళి టేబిలు లైటు వేసుకొని చదువడానికి పూనుకున్న దమయంతి రెండు పంక్తులుకూడా చదువలేకపోయింది. ఆలోచనలు అడ్డులేకుండా పరుగెత్తుతున్నాయి!

''ప్రభాకరం మనిషి మంచివాడిలాగే కనబడుతున్నాడు! అనాకారికాదు. ఒక విధంగా అందగాడే! నాజూగ్గా సీతాకోక చిలుకలాగ బట్టలు వేసుకున్నాడు. పాతిక ఏళ్ళకి ఎక్కువ వుండవు. సరదా అయిన వాడిలాగే కనబడుతున్నాడు.''

మనోవీధిలో తన ప్రక్కను ప్రభాకరాన్ని నిలబెట్టుకుంది దమయంతి.

సరిగ్గా అతని బుజములదగ్గరకు వచ్చింది తను. తనూ - అతనూ, అతనూ - తను! కొలిచింది! తూచింది! అతనిచేతిలో సిగిరెట్టు! జేబులో స్టైతస్కోపు! కళ్ళద్దాలు ........''

ఛీ! ఛీ! ఇదేంటి యిలాంటి తలపులు! ఇంతవరకూ అతను ఎవరో! అతని మనస్తత్వం, ఊహలు, ఉద్దేశాలు ఎలాంటివో? తన ప్రక్కను అతను వుండడమేమిటి? జుగుప్సతో ఒక్కసారి నుంచుంది! ఈ తలంపులతో ఒళ్ళంతా గగుర్పాటు చెంది చెమటపట్టింది ......... అటూ యిటూ తనగదిలోనే పచారు చేస్తున్నది! స్నానము చేస్తే హాయిగావుండి ఈ తలంపులన్నీ దాటి రిలీఫ్ వుంటుందనుకుంది! సీతను కేక వేసింది.

సీతరాగానే స్నానానికి నీళ్లు అవీ పెట్టమంది. సీత వెళ్లి స్నానాలగదిలో సోపు, టవలు, చీర వుంచి, వచ్చి చెప్పింది.

చెప్పల్ తొడుగుకొని స్నానాల గది

లోకి వెళ్ళింది దమయంతి. గది తలుపు లోపలకు గడియవేసింది. ఎలక్ట్రిక్ కాంతి నలుప్రక్కల ప్రకాశిస్తోంది.

నగ్నంగా స్నానము చేస్తున్న దమయంతి తన నగ్నశరీరం వేపు, అంగసౌష్టవము వేపు ఒకసారి చూసుకుంది! తన యవ్వనం తనకే అసహ్యము వేస్తున్నట్టుంది!

చటుక్కున చీర చుట్టుకొని స్నానాల గది తెఱచి బయటకివచ్చింది దమయంతి. మేడమీద తనగదిలోకి వెళ్ళి చీరమార్చుకుంది.

నాన్నగారు రావడమేమిటి, ఎనిమిది గంటలు కొట్టడమేమిటి రెండూ ఒక్కసారి జరిగేయి! భోజనాలకు వెళ్ళింది అందరితోను. తను, అన్నయ్య, నాన్నగారు ముగ్గురూ కూర్చున్నారు.

అమ్మవడ్డిస్తున్నాది; వంటలక్క రాలేదు. మరి రవణమ్మ పెళ్ళికి వెళ్లిందిగా! భోజనం దగ్గర కూర్చున్న దమయంతి అన్నం సరిగ్గా తినకుండా ఎవేవో ఆలోచించుకుంటున్నాది.

"నిజంగా జీవితంలో స్త్రీ లేనిదీ పురుషుడు, పురుషుడులేందీ స్త్రీ రాణించరు కాబోలు! లేకపోతే ఎందరోమహానుభావులు, విజ్ఞానులు పెళ్లిళ్ళు ఎందుకు చేసుకుంటారు? తను వాళ్లకంటె తెలివయినదా? లేక సంస్కారవంతురాలా? తనే తప్పు అభిప్రాయపడి వుండవచ్చు!"

అయితే తన భయం పెళ్లి అయిన తరువాత ఎలాంటి భర్తతో సంసారం సాగించవలసి వస్తుందో - ఏమో! అతని ఉద్దేశాలు తన భావాలు కలువకపోతే - అంతకంటె మరి నరకం వుండదు! ఆ! ఎందుకు కలవకపోతాయి! కలిసితీరతాయి; మళ్ళా తన మెదడులోకి ప్రభాకరం వచ్చేడు! ప్రభాకర్‌తో జీవితం ఆనందమయంగా చేసుకోవచ్చు!

"అమ్మా! కొంచం అన్నంపెట్టు!" అన్నాడు అన్నయ్య గిరి.

తల్లి వాడికి అన్నంపెట్టి తన ప్రక్క చూసి "ఏం తల్లీ! ఏం కావాలి" అంది.

తను ఏమీ జబాబు చెప్పలేదు.

"అమ్మా! ప్రభాకర్ M. B. B. S. అయిపోయిందే! ఈ వూళ్లోనే ప్రాక్టీసు పెడతాడట" అన్నాడు గిరి.

"ప్రభాకరం అంటే సీతాపతిగారి అబ్బాయికదూ!" అంది సందేహంగా తల్లి గిరితో

"ఆ! అతనే! చాల మంచివాడు!" అన్నాడు తండ్రి ముక్తసరిగా.

ఈ మాట వినగానే ప్రాణంలేచొచ్చి

నట్టయింది దమయంతికి. తిండిమీదకి దృష్టి పోవడంలేదు.

"గిరీ! అతనికింకా పెళ్లి కాలేదుకదూ!" అంది తల్లి మళ్లా

"ఏదమ్మా! మొన్ననే M. B. B. S. అయింది. ప్రాక్టీసు పెడితేగాని పెళ్లి చేసుకోనంటున్నాడు"

"అదేమిటే! అన్నం తినకుండా దిక్కులుచూస్తున్నావ్! మజ్జిగపొయ్యనా" అన్న తల్లి మాటలు వినిపించుకోకుండా ప్లేటు ముందుకి నెట్టి చెయ్యికడుక్కొని మేజమీదకి నడిచింది దమయంతి.

(సశేషము)

# కుమారి

కుమారి శిరిపురపు జిజియ

కుమారి చక్కని చుక్క. ఆ అమ్మాయి సౌందర్య రాశి. అంతకంటే ఏమాటలతో ఆ అమ్మాయి అందాన్ని వర్ణించినా ఇంతకంటే ఎక్కువ అర్థంవస్తుందనుకోను! ఆ కుమారికి మధు అని పదేళ్ళ తమ్ముడుకూడా వున్నాడు. మధుకూడా చాలా బాగుంటాడు. చిన్నతనం అవడంవల్ల అల్లరితనంకూడా మధుకి తోడుగా వుంది. కుమారి ముఖారవిందం చంద్ర బింబంకంటే ఏమాత్రం తీసిపోదంటే నమ్మండి. నొక్కునొక్కుల జుట్టు ముచ్చటైన రెండు జడలు, పసిమి బంగారూ మేను ఛాయ, ముత్యాల పలువరస, ఇంకాయేమి చెప్పమంటారు. నిండుయౌవనంతో మిసమిసలాడుతున్న జవ్వని. ఆ అందానికి తోడు కుబేరపుత్రి. తన సౌందర్య సంపదతోపాటు తండ్రి కుబేర సంపదతోపాటు ఆమెకింకో సంపదకూడా భగవంతుడు ప్రసాదించాడు. ఆ మూడో సంపద మనలో కొంతమందికి తప్పకుండా వుండి వుంటుందని నానమ్మకం. ఆసంపద మానవుని దరిజేరితే ఎప్పటికో ఒకప్పుడు అధోగతే సుమా!

కుమారి ఇంటరు రెండోసంవత్సరం చదువుతోంది ఆమె మాటకు ఎదురనేదుంటేగా ఆమెకోరికలకి ఒక అంతనేది ఉండడానికి! ఇంట్లో యే ఒక్కరూ ఆమెమాటలకి ఎదురు చెప్పేవారే కాదు. తూర్పు తెలతెలవారుతూ వుంటుంది. ఇంకా ప్రకృతిమాత మేల్కొంచలేదు. జీవకోటి విశ్రాంతికి భంగం వాటిల్లే సమయం ఆసన్నమౌతోంది. ఒక చిన్న పెంకుటింటి వసారాలో ఒక నవయౌవన సంపన్నుడు నులకమంచంమీద దుప్పటికూడా లేకుండా తలగడ నుంచుకొని నిద్రపోతున్నాడు. నిద్ర సుఖం ఎరుగదంటారిదే కాబోలు! అతనికి యిరవై అయిదు సంవత్సరాల వయస్సుంటుంది. కండపుష్టిగల యువకుడు. అతను నిద్రలో ఒకసారి కదిలాడు. నిద్రలో కూడా అతని మేను చమరుస్తోంది. పాపం! ఆ వయస్సులో మిగతా అందరి యువకుల్లా ఆశాలతలల్లో వుయ్యాలలూగడానికి కూడా నోచుకోలేదు కాబోలు! పాపం. నిర్భాగ్యుడు. కొంతసేపటినుండి ఆ ముఖం వైపేచూస్తూ అతని దురవస్తకి విలపిస్తూ ప్రక్కనే నేలమీద చతికిలబడి కూర్చున్న యీ నిర్భాగ్యురాలు చమ్మగిలిన కళ్లను తన పమిట చెంగుతో ఒత్తుకుంటుంది. ఆమె యీ నిర్భాగ్యుని మాతృదేవత. ఆమె యనుభవాలను జీర్ణింప జేసుకున్నా, గతాన్ని తలచుకొని కన్నీరు కార్చకుండా వుండలేకపోతున్న ఒకానొకయబల. ఆమె భర్త బ్రతికివున్న కాలంలో వారుకూడా చాలా హోదాతో బ్రతికారు. అయితే నేం!—భగవంతుడు చిన్నచూపు చూచినప్పుడెవరైనా అంతే. ఆమె కన్నవారూ యిచ్చారు చాలా ఆస్తి. భర్తకూడా డబ్బుగలవాడు. ఆ ధనవంతులకి లేకలేక ఒకకుమారుడు జన్మించాడు. వారి ఆనందానికంతు లేకపోయింది. ఆ కుమారుణ్ణి అరిచేతుల్లో పెంచారు. ఆనాటి గారాలబిడ్డ యీనాడానులక మంచంమీద దుప్పటికికూడా నోచుకోక ఎలా నిద్రిస్తున్నాడో చూడండి — అతను ప్రక్కకి ఒత్తిగిలినప్పుడు అతని శరీరం నులక తాళ్ల ఒత్తిడికి ఎర్రగా కందిపోయింది. ఆదృశ్యం చూడలేకా మాతృమూర్తి ఒక్కక్షణం కళ్లుమూసుకుంది.

తన భర్త వుద్యోగంకూడాచేసేవారు. అప్పుడెంతో మంది స్నేహితులుండేవారు. పెద్దపెద్ద హోదాల్లో వున్న బంధువులెంతమందో వుండేవారు. తన భర్త చావుతోపాటు ఆమెకళ్లముందునుండి వీరంతా అదృశ్యమై పోయారు.

కొంచెం కొంచెం వెలుగువస్తోంది. ఆమె గోడకు తగిలించి మినుకు మినుకుమంటూ వెలుగలేక వెలుగుతూన్న చిమ్నీ వత్తి తగ్గించింది. కాకులు కావు కావుమంటూ ప్రయాణ సన్నాహాలు చేస్తున్నాయి. ఆ అరుపులు విని ఇంతవరకూ నిద్రపోతూన్న కుమారుడు బద్ధకంగా ఒళ్లు విరుచుకుంటూ లేచి మంచంలో కూర్చుంటాడు. అంతలోకి తల్లినిచూచి "ఏమమ్మా! అప్పుడే లేచావా?" అని ప్రశ్నిస్తాడు.

"నిశ్చింతగా నిద్రపోయేరోజులు మీనాన్నగారితోనే పోయాయి నాయనా. నేనెలా బాధపడినా ఈ చిన్న వయస్సులో నీవు పడే కష్టాలనుచూస్తూంటే గుండె బ్రద్దలవుతోంది" అని కన్నీరు తుడుచుకుంటుంది.

ప్రకాశం తల్లిమాటలకు ఒక నిట్టూర్పు విడిచి ఇంట్లోకి వెడతాడు. కమలమ్మగారుకూడా ప్రకాశం వెనకనే యింట్లోకి వెళ్ళి కాఫీ ప్రయత్నంలో వుంటుంది. కాఫీపొడి కొంచెంవుంది. కాని పాలు ఎలా? ఆమె దగ్గర ఒక్క అణావుంది. ఆ అణా కెక్కడో పాలు తీసుకొచ్చి ప్రకాశానికి కాఫీ తయారుచేస్తుంది. ప్రకాశం చాలారోజులనుండి వుద్యోగానికి ప్రయత్నంచేస్తున్నాడు. బి. ఏ. చదివాడు. కానేమిలాభం? కడుపులో మాడుతూంటే ఎన్నెన్నో ఆశలతో చదివిన ఈ బి. ఏ. లు ఎమ్. ఏలు కూడుపెట్టవేం? ప్రకాశానికి ఒక్కొక్కప్పుడు పట్టలేనంత కోపంవస్తుంది తన బి. ఏ సర్టిఫికెట్టుమీద.

తల్లి యిచ్చిన కాఫీ త్రాగుతూ ఆలోచిస్తూంటాడీవూ రెక్కడెక్కడ తిరుగాలా అని. ఈవేళ చేతిలో బొత్తిగా చిల్లిగవ్వకూడలేదు. తల్లి చెబుతుందెవరి దగ్గరన్నా యొక అర్ధరూపాయి అప్పుతెస్తానని— మధ్యాహ్నం కొడుక్కి కాఫీకైనా పనికివస్తుందనామెయూహ. కాని బీదతనంలోవున్నా అతని తరహావేరు. కూడులేకపోతే మలమలమాడియన్నా చావాలిగాని ఒకరిదగ్గిర అప్పుతేవద్దంటాడు. ఉన్నదాంట్లోనే పొదుపుగా వాడుకోవాలంటాడు. లేనిపోని డాంబికాలతనికి పనికిరావు. ధనవంతులంటే అతనికొకరకమైన ఏహ్యభావంకూడావుంది. ఆ కాఫీ త్రాగి బయలుదేరాడు. కమలమ్మగారు తన భర్త స్నేహితుల్ని జ్ఞాపకంతెచ్చుకుంటూ ప్రకాశానికొక సలహాయిచ్చింది. తన భర్తకు రమేష చంద్రుడు చాలామంచి స్నేహితుడు. భర్త మరణానంతరం వారికీ, వీరికీ సన్నిహితం సన్నగిలింది. అయినా పూర్వపుస్నేహితుడు జ్ఞప్తిలో వుంటే స్నేహితుని కుమారునికి తప్పక సహాయం చేస్తాడనే యాశతో తల్లి కుమారుని బ్రతిమాలుతుందొక్కసారి పోయి రమేష చంద్రుని చూసిరమ్మని. ప్రకాశానికిష్టంలేదు. కాని తల్లి ప్రోద్బలంమీద చివరికి ఒప్పుకోక తప్పింది కాదు. రమేష చంద్రుని యిల్లుకనుక్కొని వెళ్లేసరికి పదకొండుగంటలయింది. ప్రకాశం ఆ యింటిని సమీపిస్తాడు. పెద్ద ప్రహరీగోడ. ఆ గోడమీద రకరకాల లతలల్లుకొని వుంటాయి. మధ్యలో ఒక గేటువుంటుంది. దానికికూడా రకరకాల లతలల్లుకొని పూలు వ్రేలాడుతూవుంటాయి. గేటు దగ్గరనుండి సింహద్వారంవరకూ ఒక ఆర్చిపందిరిని అమర్చారు. దానిమీదకూడా చక్కని లతలున్నాయి. దానికిరుప్రక్కలా చక్కని పూలమొక్కలెన్నోవున్నాయి. అన్నీ విరపూచివున్నాయి. చూడటానికెంతో కనుల పండువుగావుంది. అంతలోనే ఎడమప్రక్క కన్నులకు కొట్టవచ్చినట్లొక ఎర్రగులాబీ పువ్వు కనిపించింది. ప్రకాశానికెర్రగులాబీయంటే చాలా యిష్టం. చిన్నతనంలో వారింట్లో ఎన్నో ఎర్రగులాబీలుండేవి. ఆ గులాబీపైపే రెప్పవాల్చకుండా చూస్తూ వుంటాడు. ఇంతలోకి "కళ్లు కనిపించడంలేదూ—త్రోవలో నిలబడి ఏమిటా పొగరు? మర్యాద, మట్టు" — ... మరి తిరిగి చూడకుండా నవనాగరీకతంతా మూర్తీభవిస్తున్న ఒకలతాంగి మెరుపులా మెరిసి పురుములా గర్జించి క్షణంలో మాయమైపోయింది. ప్రకాశానికా క్షణంలో ఏలోకంలో వున్నదీకూడ జ్ఞాపకంరాలేదు. ఇది రమేష చంద్రునిగారిల్లేనా అని అనుమానంతో యింకోసారి బోర్డుచూసి సంతృప్తి పడతాడు. తర్వాత నెమ్మదిగా ధైర్యం తెచ్చుకుని ముందడుగు వేస్తాడు. చివరికి రమేషచంద్రుని సమక్షంలో చేర్చబడతాడు.

రమేషచంద్రునికి షుమారు 50 సం॥ వయసుం



4

టుంది. ఆజానబాహుడు. మంచి బలమైన మనిషి. ముఖం చాలా ప్రశాంతంగా వుంటుంది. ఆ ప్రశాంతమయిన ముఖం చూశాక అంతక్రితం జరిగిన విషయాన్ని ప్రకాశం పూర్తిగా మరచిపోయాడు. తనముందు నిలబడివున్న యువకుడ్ని చూడగానే రమేషచంద్రునికేమిటో జ్ఞాపకం వస్తుంనట్లనిపించింది. కాని జ్ఞాపకం తెచ్చుకోలేకపోతున్నాడు. ఆ అబ్బాయి ముఖం చూస్తుంటే యెవరినో చూసినట్లుంది. కాని సరీగా జ్ఞాపకం రావడంలేదు. కాని ఆప్తునివలె అనిపించసాగింది.

ప్రకాశం తన విషయాలన్నీ వివరంగా తెలియపరిచాడు. ఆ కుర్రవాడు తన స్నేహితుని కుమారుడని తెలియగానే రమేషచంద్రునికెంతో సంతోషమవుతుంది. కాని వారి దీనావస్థను విచారించకపోలేదు. చివరికి తన ఆఫీసులోనే యొక వుద్యోగం యిచ్చే ఏర్పాటుచేస్తాడు. ప్రకాశం ఆనందంతో వారికి హృదయపూర్వక నమస్కృతు లర్పించి బయటికి వస్తాడు. గేటు తెరచుకుని ఎండ చుర్రుమనిపిస్తున్నా లెక్కచెయ్యకుండా త్వర త్వర గా అడుగులు వేసుకుంటూ యింటికిచేరి తల్లికి సంతోషవార్త చేరవేస్తాడు. ఆమెంతో ఆనందిస్తుంది. ఆ రోజు మొదలు రోజూ ఆఫీసుకువెళ్లి శ్రద్ధగా పని చేస్తూంటాడు. తన స్నేహితుని కుమారుడవటంవల్ల కేవలం వుద్యోగివలెకాక జీతంతో మరికొంత డబ్బు కూడా ముట్టచెబుతూ వుంటారు రమేష్‌గారు. ఇలా 5, 6 నెలలు గడుస్తాయి. ఇప్పుడు ప్రకాశం ఒక డీసెంటుగావున్న యిల్లు అద్దెకు తీసుకున్నాడు. ఏలోటూ లేకుండా హాయిగా రోజులు గడుపుతున్నాడు తల్లితో. రోజూ ఎప్పటిలా శ్రద్ధగావెళ్ళి ఆఫీసు పనిచేసుకుంటూ వున్నాడు. రమేషచంద్రునికి ప్రకాశం ఎంతో ప్రీతిపాత్రుడయ్యాడు. ఒక రోజు రమేషచంద్రుడు తనకుమార్తె పుట్టినరోజు విందుకుపిలిస్తే ప్రకాశం వెళ్తాడు. విందులో రమేషచంద్రుడు తన కుమార్తెను పరిచయంచేస్తాడు ప్రకాశానికి. ఆమెను చూడగానే ప్రకాశానికి స్మృతిపథంలో చటుక్కున ఒక మెరుపుమెరిసి ఆ నాటి వురుము జ్ఞాపకానికొచ్చి చిరునవ్వు అతనికి తెలియకుండానే యతని పెదవులపై నాట్యం చేసింది. “ప్రకాశం ఇదివరకు మా కుమారిని తెలుసా? నవ్వుతున్నావేం నాయనా?” అని రమేష్‌గారు ప్రశ్నిస్తారు.

“నాకు బాగా తెలియదుగాని మొదటిసారి మిమ్మల్ని కలుసుకోవడానికి వచ్చినప్పుడు చూశానండి” అని జవాబిస్తాడు. ఈ మాట వినగానే కుమారి కారోజతన్ని తనేమేమన్నదో అన్నీ జ్ఞాపకం వచ్చి సిగ్గుపడుతుంది. తర్వాత కుమారి చాలా సేపతనితో అవీ ఇవీ మాట్లాడుతూనే వుంటుంది. విందు పూర్తి అయ్యేక వెళ్ళేముందప్పుడప్పుడూ వస్తూండమని ప్రకాశంతో చెబుతుంది. ప్రకాశంయొక్క రూపురేఖలు కుమారిని ఆకర్షించాయి. ప్రకాశం తండ్రితో పనివుండి వచ్చినప్పుడల్లా కుమారి ప్రకాశంతో ఎంతో ఆప్యాయంగా మాట్లాడుతూవుండేది. ఆమెలో ప్రకాశంపేరు వినగానే ఏదో సంచలనం కలగటం మొదలుపెట్టింది.

ఒక రోజు కుమారి వివాహ ప్రస్తావనవస్తే ప్రకాశంపేరు చల్లగా వూదుతుంది తండ్రి చెవిలో: తల్లి అందుకు ఒప్పుకోదు. రమేష్‌గారు ప్రకాశం నడవడివైపు మొగ్గుతారు అతని ధనంవైపుకంటే కాని కుమారి తల్లికేమాత్రం యిష్టంలేకపోతుంది బీదవాడి కివ్వడానికి. కుమారి మంకుపట్టుపట్టడంవల్ల తల్లికూడా కుమార్తెను వ్యతిరేకంగా చెప్పలేకపోయింది. కుమారి యొకరు చెప్పినా వినేమనిషి కాదనే విషయం అందరికీ తెలుసు. ఒక రోజు రమేష్‌గారు ప్రకాశంతో చూచాయగా విషయం తెలియజేస్తారు. ప్రకాశానికేమాత్రం యిష్టంలేదు. ధనవంతులతో సంబంధ బాంధవ్యాలంటే అతనికి గిట్టదు. అందులో కుమారి ప్రతాపం మొదటిరోజునే సింహద్వారం చూడకముందే చవిచూచాడాయెను. ఈ విషయం కమలమ్మగారికికూడా రమేష్‌గారు కబురు చేస్తారు. ఆమె కెంతో సంతోషమవుతుంది. ప్రకాశం నాన్నగారే బ్రతికివుంటే యిద్దరి స్నేహితులమధ్యా బంధుత్వం పొడసూపుతున్నందుకెంతో ఆనందించేవారు. ఆమెంతో సంతోషంతో ప్రకాశంతో చెబు

తుంది రెండు కుటుంబాలూ కలవబోతున్నందుకు తనెంతో అదృష్టవంతురాలనని. కాని ప్రకాశం ముభావంగా వుంటాడు. తల్లికి కారణం అవగాహనం కాక తికమకలౌతుంది. చివరికి కుమారి ప్రవర్తన గురించి తల్లికి చెబుతాడు ప్రకాశం. కాని తల్లి దానికంత ప్రాముఖ్యత యివ్వదు. తన కోరకైనా ఆమెను పెండ్లిచేసుకోమని మరీ మరీ చెబుతుంది. అటుమాస్తే రమేశచంద్రుని మంచితనం ప్రకాశం కాళ్ళకి బందాలు వేస్తోంది. చివరి ప్రయత్నంగా ఒకసారి కుమారితో మాట్లాడాలనుకుంటాడు ప్రకాశం.

"మీరా! నాన్నగారు యింట్లోలేరే. ఇప్పుడే ఎక్కడికో వెళ్ళారు. నాన్నగారితో మాట్లాడ డానికి వచ్చారా?"

"లేదు. మీతోనే మాట్లాడదామని వచ్చాను."

"నాతోనా, కూర్చోండి" - అని తను కూర్చుని అతనేమి మాట్లాడతాడోనని అతని ముఖంవైపే చూస్తూ వుంటుంది. ఫాన్‌గాలి కతనిక్రాపు చెరిగి కొన్ని వెంట్రుకలు ముందుకుపడి అటూ ఇటూ కదు లుతూ చూడ ముచ్చటగా వుంటాయి. అతని ముఖం వైపుచూస్తూ తను తండ్రితో చెప్పిన విషయం జ్ఞాపకం రాగా సిగ్గుతో తలవంచుకొంటుంది.

"కుమారీ! ఒక విషయం చెబుతాను. మీరు తొందరపడకుండా నిదానంగా ఆలోచించండి. నన్ను మాత్రం అపార్థంచేసుకోకండి. మీ నాన్నగారు నన్నొక విషయం అడిగారు. అది మీకుకూడా తెలిసే వుండాలి. నేను బీదవాడ్ని. మీరేమో ధనవంతులు. మీరు నన్ను చేసుకుని మాత్రం ఏమిసుఖపడతారు! మీకు కార్లూ, మేడలూ, కావలసినంతమంది దాస దాసీజనం వుంటారు. మీరు మా యింటికివస్తే అవేమీ వుండవు. అన్నీ నేను బాగా ఆలోచించే వచ్చాను — మిమ్మల్ని త్వరపడవద్దని చెప్పడానికి. మీరు 'ఊ' అంటే ఎంతోమంది ధనవంతులు వస్తారు. మీరు సుఖంగా వుండొచ్చు" అని చెబుతాడు.

ఈ మాటలువిని కుమారి చిన్నబుచ్చుకొంటుంది. అంతా విన్నాక చెబుతుంది—

"నేను ప్రేమించేది మనిషినిగాని డబ్బునుకాదు. నాకీడబ్బేమీ అవసరంలేదు. నేను ఒకసారి నిశ్చ యానికి వచ్చానంటే దాన్ని నా జన్మలో మార్చు కోవడం నా కలవాటులేదు. నాకు కావలసింది మీరు. కాని మీ డబ్బుకాదు. కనుక మీరేమీ నా గురించి విచారించనవసరంలేదు" అని చెబుతుంది. ఇది విన్నాక ప్రకాశానికేమి చెప్పడానికీ తోచక తల వంచుకుంటాడు. కుమారి విజయగర్వంతో ఆ లేత పెదాలపై చిరునవ్వు చిందిస్తుంది.

కొద్దికాలంలో కుమారికీ, ప్రకాశానికీ వివాహం అతివైభవంగా జరుగుతుంది. కుమారి ప్రకాశం యింటికివస్తుంది. మొదట్లో సంతోషంగానే వుంటుంది. ఏలోటూ కనిపించదు. కమలమ్మగారు ఎంతో ప్రేమతో ప్రకాశంకంటేకూడా ఎక్కువగా చూసు కొంటూవుంటారు. గొప్పయింటిబిడ్డకదా అని గ్లాసుతో నీళ్లు ముంచుకుంటే యెక్కడ అలసిపోతుందోనని ఎంతో కనిపెట్టుకొని వుంటూ వుంటారు. కాని కుమా రికి ప్రకాశంమీదవున్న ప్రేమవల్ల కొంతకాలం వరకూ ఏవిషయంమీదకీ మనసు వెళ్ళలేదు కాని కొన్నా ళ్ళకి కారులేనిలోటూ, దాసీలులేనిలోటూ కన్పించ సాగింది. ఒక రోజేదో సినిమాకి వెళ్ళాలనుకుంటారు. వారు వెళ్లేసరికి సినిమా మొదలు పెడతారు. ఆ సమ యంలో కుమారి అసలు తత్వం నెమ్మదిగా తలెత్తి నేను నిన్నొదిలి ఎక్కడికీ పోలేదన్నట్లు కారులేదన్న కోపంతో బయటపడుతుంది. కారుంటే సినిమాకి వచ్చేవాళ్లం అంటుంది కొంచెం విసురుగా. ప్రకాశం మాట వినీవిననట్లూరుకుంటాడు. అప్పటినుండీ ఆమె కేవేవో లోపాలు కన్పిస్తూనే వుండేవి. చివరికి కమ లమ్మగారిమీదకూడా విసుక్కుంటూ వుండేది. కాని యామె "చిన్నతనం" అనుకుని వూరుకునేది. ఒక రోజేదో చిన్న విషయానికి ప్రకాశంతో మాట్లా డటం మానివేస్తుంది. ప్రకాశం అందుకుంటాడు "కుమారి! అందుకేగా నేను ముందే ఎన్ని విధాలో

చెప్పాను. నీవు చిన్నతనంనుండి గొప్ప యింట్లో పెరిగావు. ఇక్కడ వుండలేవు. ఈ నిర్భాగ్యుణ్ణి పెండ్లిచేసుకోవద్దని ఎన్నిసార్లుచెప్పినా విన్నావు కాదు. ఇప్పుడెందుకు బాధపడతావు? కారు కావాలంటే నేనిలా తెస్తాను! నేను ధనవంతుణ్ణి కాదుగా!"

"మీకు లేకపోతే మా నాన్నగార్ని అడగ్గూడదా?"

"కుమారీ! అయితే పూర్తిగా నన్నింకా అర్థం చేసుకోలేదన్నమాట నీవు. నేను యింకొకరి దగ్గర అడిగి తెచ్చుకునేవాణ్ణిగాదు. వున్నంతలోనే సరి పెట్టుకునే స్వభావంనాది. నీవు నా భార్యవు కనుక నాకే విషయాల్లో సహాయంగా వుంటావని ఎంతో ఆశపడ్డాను. ఇప్పటికయినా నీవు నన్నర్థం చేసుకుంటే మనమెంతో హాయిగా వుంటాం."

"హుఁ! హాయి. నా ఆస్తి నేను తెచ్చుకుంటానంటే మీకేంపోయింది. ఇంకా హాయిగా యిలానే వుండాలిట. నేనుండలేను - మీలాగ నులకమంచం మీద పడుకునే గతి నాకేం పట్టింది? ఊఁ - అంటే ఏడ్పైనా వస్తుందినాకు. ఇక నేనుండలేనిక్కడ" అని మరి ప్రకాశం మాటకి ఎదురుచూడకుండా కట్టుగుడ్డల్తో తండ్రిగారింటికి వెళ్ళిపోతుంది కుమారి. తండ్రికి జరిగిందంతా చెబుతుంది. కుమారి మూర్ఖతకి తండ్రి ఒక నిట్టూర్పు విడుస్తాడు. కాని తల్లి "నేచెబితే వింటేగా. అమ్మాయీ! అతనే కావాలి. డబ్బు అవసరంలేదని మంకుపట్టు పట్టావే? ఇప్పటికైనా తెలిసిందా? అనుభవించు. ఎవరికి?" అని ఎత్తిపొడుస్తుంది.

ప్రకాశం ఎంతో బాధపడతాడు. కమలమ్మగారు కంటనీరు పెట్టుకుంటుంది. ప్రకాశం అంటాడు "అమ్మా! ఇప్పటికైనా తెలిసిందా? నేను చెబితే విన్నావుకాదుగా! అంతేనమ్మా గొప్పవాళ్లు" అని వూరుకుంటాడు. ఆఫీసులో మామా అల్లుళ్లు ఒకరి ముఖం ఒకరు చూసుకోలేకపోతున్నారు. ప్రకాశాన్ని పూర్తిగా అర్థంచేసుకున్నాడు రమేష్‌గారు. తన కూతుర్నిప్పటికైనా త్రోవలో పెడితే దానికి ప్రకాశమే సమర్థుడని ఆయనకెంతో నమ్మకంవుంది. ఆ నమ్మకంతోనే ధైర్యం తెచ్చుకుని వూరుకుంటాడు.

కుమారి యింటికి వచ్చాక అన్ని సౌఖ్యాలూ వచ్చాయి. మళ్లా పూర్వంలా సంతోషంగా వుండసాగింది. తమ్ముడు యిప్పుడు కొంచెం పెద్దవాడయ్యాడు. అక్కచేసింది పొరపాటే అని మధుకి కూడా అనిపించింది. కాని అక్కతో అంటే ఇంకేమయినా వుందా? ఒక్కసారి ప్రకాశం దగ్గరకి వెళ్లి కూర్చునేవాడు. అక్కచేసిన పనికి బావగారి దగ్గర సిగ్గుపడేవాడు మధు. ఎలాగయినా అక్కని మార్చాలని మధుకి బాగావుంది. కాని తనతో ఏమవుతుంది? ఒకసారి కుమారి, మధు వర్షంలో తడవడం జరుగుతుంది. మధుకి ఆ మరునాడు జ్వరం వస్తుంది. అదేపోతుంది అనుకున్నారు. కాని రోజురోజుకీ ఎక్కువ అవడమేగాని తగ్గడంలేదు. మధుకి బావని చూడాలనే కోరికకూడా రోజురోజుకీ ఎక్కువ అవడం వల్ల ఒక రోజు నాన్నగారితో చెబుతాడు. రమేష్ చంద్రగారా కబురు ప్రకాశంతో చెబుతారు. ప్రకాశానికికూడా మధు అంటే చాలాయిష్టం. ఎంత చిన్నతనం అయితేనేం అన్ని విషయాలనీ అర్థంచేసుకోగల సామర్థ్యతవుంది మధులో అదే లోపించింది కుమారిలో.

ప్రకాశం యింటికిరాగానే మామగారెంతో సంతోషించారు. మధుకి నిజంగా జ్వరం సగం తగ్గిపోయినట్లనిపించింది. ప్రకాశం మధు దగ్గర కొంచెం సేపు కూర్చుని వెళ్ళిపోయాడు. అతను వచ్చినప్పుడు కుమారి తనగదిలోనుండి ప్రకాశాన్ని చూడటం జరిగింది. అతను వెళ్ళిపోయాక కుమారిలో ఏదో మార్పు రావడం మొదలుపెట్టింది. ఆరోజు సాయంత్రం ఏకాంతంగా తోటలో కూర్చుని వుంటుంది, ఆరోజు వరకూ లేనిలోటేదో ఆరోజున్నట్లనిపించింది కుమారికి. ప్రకాశంలోని శాంతం, అతని ముఖం అన్నీ జ్ఞాపకం రాసాగాయి. తన మనస్సులో ఏదోదేవినట్లనిపించింది. ఆమెకారోజు సరిగా నిద్రపట్టలేదు. ఏమేమిటో ఆలోచిస్తూనే పడుకుంది. అర్థరాత్రివేళ తమ్ముని

కలవరింపు వినిపిస్తుంది. ఉలిక్కి పడుతుంది. తమ్ముడంటున్నాడు—

"బావా! విచారించకు అక్కదే తప్పు. నీవెలాంటి వాడవో అక్క తెలుసుకోలేకపోతోంది. వెధవ సంపదమీద వ్యామోహం అక్కకి. మరి అది పోయాకో — అప్పుడు — బుద్ధివస్తుంది అక్కకి. బావా... నేను నీదగ్గరే వుంటాను బావా" అంటూ మధు కలవరిస్తున్నాడు.

కుమారి లేచి కూర్చుంటుంది. తన కళ్ళకు పొరలు విడిపోయినట్లనిపించింది. పొరలు విడిన కండ్లతో ప్రపంచంలోకి చూస్తుంది. ఎంతమంది బీదవాళ్లులేరీ ప్రపంచంలో. అందులో ఎంతమంది సుఖంగా వుండటంలేదు. వాళ్ళయింటిముందు చెట్టుక్రింద రోజూ అడుక్కుని తెచ్చుకున్న బియ్యాన్ని వండుకుని తిని వెన్నెల్లో హాయిగా ఆనందాన్ననుభవిస్తున్న ఆ భిక్షకులామెకు కనిపించారు. ఆమెలేచి అటూ యిటూ తిరగటం మొదలు పెట్టింది. అంతక్రితంరోజున ఆ ప్రక్కనే జరిగిన ఒకవిషయం కళ్ళకు కట్టినట్లగుపడసాగింది. ఒకామె తనభర్త కారు ప్రమాదానికి గురి అయినాడని విని గుండెలు బ్రద్దలయేట్లు ఏడవసాగింది. ఆ త్రాగుబోతు కొరకంతగా విచారించేదేమిటంటే—అన్నవారినెన్ని మాటలన్నది! ఏమి చేసినా భర్తకంటే యీ ప్రపంచంలో ఎవరన్నది. శవం మీద పడి దానితో పాటు తననికూడా కాల్చివెయ్యమన్నది. అబ్బా! అంటూ ఒకసారి నిట్టూర్చింది కుమారి. వెంటనే ఏదోపిచ్చి ఆలోచన వచ్చింది. తన ప్రకాశానికెప్పుడైనా అలా ... అమ్మో! అంటూ ఒక అరుపు అరచి ఎదురుగావున్న ప్రకాశం ఫొటోను గట్టిగాపట్టుకుని వెక్కి వెక్కి ఏడవడం మొదలు పెట్టింది. మధుకాకేకకి మెలకువవచ్చి ఆదృశ్యం చూస్తాడు. మధుకికూడా ఎంతో సంతోషమయింది అక్కలోని మార్పుకి.

మర్నాడు తల్లితో చెబుతుంది తన యింటికి వెళ్ళిపోతానని. ఆమెకేమీ అర్థంకాక అలానే చూస్తూ వుంటుంది. తండ్రితో చెబుతుంది. తండ్రి చిరునవ్వు నవ్వి ప్రేమతో తలనిమిరి కుమార్తెను హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తాడు. ఆమె బయలుదేరుతుంది భర్త యింటికి. మధు అంటాడు—

"అక్కా! బావనింక ఎప్పుడూ విడిచిపెట్టరాకేం. ఒంటరివాడయి పోతాడు" అని

కుమారి నవ్వి తమ్ముడ్ని దగ్గరకు తీసుకొంటుంది. "నువ్వెళ్లక్కా సాయంత్రం నేనూ నాన్నగారూ వస్తాంలే మీయింటికి. కారు పంపిస్తావా అక్కా" అంటాడు చిలిపిమధు. అందుకు కుమారి సిగ్గుపడుతుంది. తండ్రిఎండగా వుందమ్మా అన్నా వినిపించుకోకుండా తనకు భగవంతుడిచ్చిన కర్మేంద్రియాలసహాయంతో స్వగృహానికి పయనమవుతుంది మన కుమారి.

# జర్మను

## కథలు! కబుర్లూ!

'జర్మానంద'

### కాలునొప్పి!

ఒక పల్లెటూరిలో ఒకాయన వుండేవాడు. ఉత్తర పత్రాలు రాయటమంటే ఆయనికి ఎంతో బద్ధకం. ఒక రోజున ఆమడదూరంలోనున్న తన బంధువుకి ఏదో కబురు పంపాలని నిశ్చయించుకున్నాడు. ఆ వూరికి సమీపాన్నేవున్న పోస్టాఫీసుకి చేరుకుని, లోపల పనిపాటలను చూసుకుంటూవున్న గుమాస్తాని పలకరించి తనకొక వుత్తరాన్ని రాయమని బ్రతిమాలుకున్నాడు మన పల్లెటూరి బద్ధకపు మనిషి.

గుమాస్తా ఆయన కోరికను విన్నాడో లేదో వుక్కిరి బిక్కిరి అయ్యాడు. "అబ్బే ఆ పనిచేయటానికి ఎలా సాధ్యమవుతుంది? కాలు వాచింది. అంచేత రెండు మూడు రోజులు ఆగితే బాగుంటుంది" అని ఆయనతో అన్నాడు.

ఆ మాట విన్నాక పల్లెటూరి ఆయన పక్కున నవ్వాడు. "ఎందుకలా కంగారు పడటం? కాలువాపుకీ, వుత్తరం రాయటానికి లంకె పెట్టడం ఏం సబబుగావుందో చెప్పండి? మిమ్మల్ని అడిగింది వుత్తరం రాయమని. నడవమని అడగలేదే" అని ఒక విసురు విసిరాడు.

గుమస్తా గట్టివాడు. సమయస్ఫూర్తి అంటే అతనికే పెట్టిందిపేరు. "మీరన్నది నిజమే. అలా లంకెవేయటం తప్పే... కాని నేనే మీ వుత్తరాన్ని రాశానే అనుకోండి. ఆ జాబుని అందుకున్న ఆయన దానిని నా దగ్గరకే పంపుతాడుగా! దాన్ని చదివి ఆయనికి వినిపించటానికి నడిచే స్థితిలో వుంటేగా నేను..." అని చప్పున అనేశాడు గుమస్తా ఆ పెద్ద మనిషికేసి కొంటె చూపుల జూస్తూ.

### ముసలావిడ పక్షపాతం!

ఒక ముసలావిడకి చిలుక అంటే పంచప్రాణాలూ లేచివస్తాయి. చిలుకని పెంచి పోషించటానికి తన స్వంత బిడ్డలకన్నా ఎక్కువ ఏర్పాట్లని తన ఇంట్లో యథాతథంగాచేసేది. భోజనాల గదిలో పంజరాన్నివుంచి, పంజరం దగ్గరే కూచోటం, చిలుకతో ఆ కబుర్లని, ఈ కబుర్లనీ చెబుతూ మురిసిపోవటం ఆవిడ దినచర్యలో అతిముఖ్యమైన కార్యక్రమం అయిపోయింది. చిలుకకి చూపే గారాబంలో అంతకాకపోయినా కొంత వరకైనా, తను ఇంట్లో పెంచుతూవున్న పిల్లిపట్లచూపుతూ వుండేది ఆ ముసలావిడ. పిల్లి జిత్తులమారి.

తనకు చిలుకకు ఇచ్చినంత మర్యాద ఇయ్యటంలేదని ముసలావిడపట్ల గునిసిపోతూవుండేది. కాని ఆ సంగతి పైకి తెలియనీయకుండా వుండటానికి చేయాలసిన ప్రయత్నం చేసింది. ...

ఒక రోజున వుదయాన ముసలావిడ ఇంట్లోనుంచి ఏదో పని చూసుకోనడానికి వూళ్లోకి వెళ్లాలసివచ్చింది. చిలుక పంజరంలోనుంచి చప్పున క్రిందికిదిగివచ్చి యజమానురాలు తనకోసం అమర్చివుంచిన రొట్టెముక్కల్ని తినసాగింది. ఆ సమయాన ఏమూల పొంచివుందో, పిల్లి చిలుకమీదపడి దాని మెడని గట్టిగా పట్టుకుంది. పిల్లివాతనుంచి తప్పించుకోనడానికి చిలుక ఎంత ప్రయత్నించినా లాభం వుంటేగా! ... ఆ సమయాన్నే ముసలావిడ ఇంట్లోకి అడుగుబెట్టి ఈ దృశ్యాన్ని చూస్తూ హడలిపోయింది. చిలుకని ఆ ఆపదనుంచి రక్షించడానికి దేవతలే క్రిందికి రావాలసివచ్చినంతపని అయిందని చెప్పినచాలు. ... ఆ కంగారులో తను పెంచుతూ వున్న పిల్లే ఈ పనినంతా చేసిందని కోపపడ్డది. దాన్ని బయటికి తరిమివేసి తిరిగి లోపలికి వచ్చింది ముసలావిడ. ఆదేం ఆశ్చర్యం! ఆశ్చర్యం! తన పిల్లి గదిలో మూల కదలక మెదలక వుండటం, దాని దృష్టి అంతా ఆ చిలుకమీదే వుండటం చూసి స్తంభించిపోయింది. తను బయటికి వెళ్లేటప్పుడు తలుపు మూయటం మరచిపోవటం తరువాత తెలుసుకున్నది. అంచేత తనే పరాయివాళ్ల గండుపిల్లి లోపలికి వచ్చింది. చేయాలసినపని యథాతథంగా చేసుకున్నది. ముద్దుల చిలుక ఆ పాపిష్టి పిల్లివాతపడి ప్రాణాల్ని పోగొట్టుకున్నది. దాని ముందర తన పిల్లి ఏంచేయగలుగుతుంది? ... ఇక ఏం అనుకున్నా లాభం వుంటుందా అనుకోని ముసలావిడ పిల్లిని చేరదీసి ఆ దుఃఖాన్ని మరచిపోడానికి శాయశక్తులా ప్రయత్నించింది.

## తీర్పరి!

ఇద్దరు కుర్రవాళ్లు బాదం చెట్టుక్రింద ఆడుకుంటూ వున్నారు. చెట్టు మీదనుంచి కాయ ఒకటి ఆ సమయాన క్రిందబడ్డది. మొదటి అబ్బాయి కాయక్రిందపడటం చూసి దానిని చప్పున పుచ్చుకున్నాడు. ఆ పనికి రెండో అబ్బాయి చిర్రెత్తిపోయాడు. "అది నాది-క్రిందపడటం నేనే ముందు చూశాను" అంటూ మొదటి అబ్బాయి చేతినుంచి కాయను బలవంతంగా లాగుకోనటానికి ప్రయత్నించాడు.

వాడిని మించినవాడే మొదటి అబ్బాయి కూడా! "నీవు అనేది అబద్ధం. మొదట చూసింది నేనే. అంచేత అది నాదే" అంటూ కీచులాటకు తయారయ్యాడు.

అదే సమయాన మరో అబ్బాయి ఆ దోవనే నడుస్తూ వీళ్ల కీచులాటను చూస్తూ

ఒక్క నిమిషం అక్కడే ఆగిపోయాడు. "ఎందుకిలా తగవులాడుకోటం?" అని వాళ్లని అడిగాడు. ఇద్దరు అబ్బాయిలూ ఆ కీచులాటకు కారణాన్ని ఆ పిల్లవాడికి చెప్పారు. ఒక్క నిమిషం ఆలోచించాడు ఆ అబ్బాయి వాళ్ల కేసును విన్నాక "అంతేగా! ఆ కాయని ఇలా నా చేతి కిచ్చివేయండి. మీ తగవును ఒక్క నిమిషంలో తీర్చివేస్తాను అంటూ" ఆ అబ్బాయి కాయను పుచ్చుకొని, రెండు భాగాలుగా చేసి రెండో అబ్బాయి చేతికి ఒక భాగాన్ని యిస్తూ "నువ్వేగా కాయ కిందపడటం చూశానని అన్నది. దాని కోసం దీన్ని తీసుకో" అని అన్నాడు. మొదటి అబ్బాయికి మిగతా దాన్ని యిస్తూ "ఇది నీది-నువ్వేగా నేల మీద నుంచి కాయను ఎత్తింది" అని ఆ అబ్బాయి కేసి చూస్తూ అన్నాడు. "ఇక నాకో - మిగిలింది బాదంపప్పు. తగవుని తీర్చినందుకు ఇదినాకు రావాలిగా. అంచేత దాన్నే పుచ్చుకుని తృప్తిపడుతాను" అంటూ పప్పుని నోట్లో వేసికుని, తన దోవనే గబగబ నడిచి పోయాడు.

## గుడ్డి గుర్రం!

ఆ వూళ్లో ప్రతి ఆదివారమూ పెద్ద సంత. చుట్టు ప్రక్కల వాళ్లకి అవసరమైన వస్తువులు ఏం కావాలంటే వాటికోసం వాళ్లు తప్పని సరిగా ఈ సంతకు రావాలసిందే. గుర్రాల ఆసామి తను పెంచి మాలిం చేస్తూవున్న గుర్రాలను ఈ సంతలోనే అమ్ముతూ వుండేవాడు. ఒకాయన తనకు మంచి గుర్రం కావాలని గుర్రాల ఆసామిని అడిగాడు. ఆసామికి కావాలసింది బేరగాళ్లు. ఆయన్ని చూశాడో లేదో - ఆయన కోరికను విన్నాడో లేదో, ఇక పూరకవుండే ఘటం అయితేగా - ఆ ఆసామిది! "నా దగ్గర మంచి గుర్రంవుంది. ఏలాటి సుళ్ళూ, మరి ఇతరపోర బాట్లూ ఈ గుర్రంలో లేవు. ఇంత మంచి గుర్రం మరి యెక్కడైనా విక్రయానికి దొరకటం కష్టం." అంటూ తన డోలును బేరగాడి ముందర బాగా వాయించాడు.

ఆ మాటలకు ఆయనా వుబ్బి తబ్బిబ్బై పోయాడు. ఆసామి అడిగిన సొమ్మును ఇచ్చివేసి గుర్రాన్ని తన ఇంటికి తిన్నగా నడిపించుకుని వెళ్లాడు. కొంత కాల మయ్యాక గుర్రం కళ్లలో ఒకటి గుడ్డిదని తెలుసుకున్నాడు. దాంతో ఆయన చిర్రెత్తి పోతూ ఆ గుర్రాల ఆసామి ఇంటికే గుర్రాన్ని తీసుకునివచ్చి అలాటి గుర్రాన్ని తనకెందుకు అమ్మావని చేయాలసిన రభసంతా చేశాడు. గుర్రాల యజమాని శాంతంగా అతను చెప్పేదానినంతా వింటూ "అంతేగా! గుర్రంలో ఎలాటి సుళ్లూ, ఇతర పోరబాట్లూ లేవని చెప్పాను. దానికి

(106-వ పేజీ చూడుడు)



# మీకు ఇవి సాధ్యమే!

ఒక స్వంత ఇల్లు





ఒక తోట కొనడము



మీ పిల్లలకు విద్య చెప్పించుకొనడము



అనారోగ్యానికి డబ్బు నిల్వ



వృద్ధాప్యానికి కొంత ఏర్పాటు

మీ డబ్బు నేషనల్ సేవింగ్స్‌లో భద్రముగా నుండుటేగాక మంచి వడ్డీ కిడుతుంది. మరియు జాతీయ ప్రణాళికా నిర్వహణకై దేశమునకు ఆర్థిక సహకారిగా ఉంటుంది.

ఇతర వివరాలకు మరియు లేక ఈ దాస్తానాల నియమావళికొరకు దయవుంచి నేషనల్ సేవింగ్స్ కమిషనర్, సిమ్లా లేక మీ రాష్ట్రముయొక్క రీజనల్ నేషనల్ సేవింగ్స్ అధికారిగారికి వ్రాసుకొనండి.

**మీ యొక్క, మీ దేశముయొక్క, సౌభాగ్యము కొరకు మీ నిల్వలను వినియోగించండి**

DA 56/160 TG

# ప్రేయసి 

# వద్దకు

#  ప్రయాణం

శ్రీ గిడుగు వెంకటరామమూర్తి

(గతసంచిక తరువాయి)

### 3-వ రంగం

[అదే గది. జూన్ 10-వ తేదీ రాత్రి 9 గంటల సమయం - సుశీల లోపున (నేపథ్యంలో) జబ్బుతో తెలివితప్పి ఉంటుంది. ఒకటి రెండు సార్లు "మోహన్ నన్ను మోసంచేశావా?" అని పలవరిస్తుంది. గదిలో టేబిల్ మీద మందు సీసా వగైరా ఉంటాయి. కృష్ణమూర్తి రోగిని కనిపెట్టుకుని ఉంటాడు. ఒకసారి మందుయిచ్చినట్టు వెళ్ళివచ్చి, తోచక యిటూ అటూ తిరుగుతూ ఉంటాడు. మాధవరావు అలసిపోయి రోజుకుంటూ వస్తాడు.]

మాధవ:—[వస్తూ] కృష్ణా! సెలవు యివ్వనన్నాడు, మా మేనేజరు. ఇవాళ చాలా అర్జెంటుపని ఉందిట! ఈ రాత్రి తప్పకుండా పనిచేసి తీరాలన్నాడు. ఈ నైట్ డ్యూటీ ఒకటి వచ్చిపడింది. వెళ్ళక తప్పదు. ... సుశీల యీ స్థితిలో ఉంటే ఎలా వదలివెళ్ళనురా!

కృష్ణ:—మీరుండి చేసేదేముంది? నేను ఉన్నానుగదా? ఫరవాలేదు మీరు వెళ్ళండి. ... త్రోవలో డాక్టర్ గోపాల్ గార్ని కలసి ఆయన్ను యిక్కడికి పంపించి మరీ వెళ్ళండి.

మాధవ:—జాగ్రత్త నాయనా! అవసరమైతే ఎవరి చేతనైనా కబురుపంపు.

కృష్ణ:—అలాగే; వెళ్ళండి; డాక్టరుతో చెప్పి మరీ వెళ్ళండి.

మాధవ:—జాగ్రత్త నాయనా!

కృష్ణ:—అలాగే! వీలయినంత త్వరలో మీరూ వచ్చెయండి.

మాధ:—అలాగే; జాగ్రత్త,-వస్తాను. [మాధవరావు వెళ్ళిన కొలది కాలమయిన తర్వాత డాక్టర్ గోపాల్ వస్తాడు.]

గోపాల్:—[వస్తూ] ఏం కృష్ణా ఎలాగుంది?

కృష్ణ:—వచ్చేరా - అలాగే ఉంది. తెలివిరాలేదు. మీరు చూడండి. [రోగిని పరీక్షచేయడానికని లోపుకు వెళ్ళి వస్తాడు.]

గోపాల్:—మీ నాన్నగారెక్కడ?

కృష్ణ:—మీ దగ్గరకురాలేదూ? ఇప్పుడే వెళ్ళారు.

గోపాల్:—నేను యింట్లోలేను; వేరే కేసుమీద సాయంత్రం వెళ్ళి యిప్పుడే వస్తున్నాను. ఆయన ఎక్కడికి వెళ్ళారు?

కృష్ణ:—నైట్ డ్యూటీ ఉంటే వెళ్ళారు.

గోపాల్:—పేషంట్ యీ కండిషన్‌లో ఉంటే ఎలా వెళ్ళారోయ్ ?

కృష్ణ:—ఏం చెయ్యమన్నారు ? వెళ్ళక తప్పలేదు.... ఏం ఎలాగుంది ?

గోపాల్:—ఇప్పటికి Pulse బాగానే ఉంది; గుండెపరిస్థితి కూడా బాగానే ఉంది కాని...

కృష్ణ:—డాక్టర్‌గారూ చెప్పండి ! మరేం భయం లేదుకదా ? ప్రాణాపాయంలేదుకదా ? ... చెప్పండి.

గోపాల్:—ఈ రాత్రికి ఏం ఫరవాలేదుగాని, ఎంత యినా సీరియస్ కండిషన్ అనే చెప్పాలి.

కృష్ణ:—డాక్టర్ ! రెండు రోజుల్లో యింత సీరియస్‌గా ఎలా మారింది ? అసలు యింతకు జబ్బేమిటంటారు ?

గోపాల్:—ఇదేదో మెంటల్ షాక్‌లా ఉంది. Brain effect అయిందోయ్ ! ... ప్రయత్నించి చూద్దాం ... నా లోపంలేకుండా ప్రయత్నిస్తాను. ... ఇప్పుడే ఒక్క యింజక్షను యిచ్చానుగదా ? మళ్ళీ రాత్రి రెండు గంటలకు మరొకటి యిస్తాను.

కృష్ణ:—డాక్టర్ ! మీరు తప్పితే మాకు వేరే దిక్కు లేదు. మీ దగ్గరకు రావడానికికూడా నాకు ఎవరూ తోడులేరు. మీరు తప్పకుండా రెండు గంటలకు వస్తారుకదూ ?

గోపాల్:—తప్పకుండా వస్తాను, వచ్చి తీరుతాను. అసలు ఈ రాత్రి నేను నిద్రపోవడానికి వీలుండదు. ఇక్కడకు దగ్గరగా 5 మైళ్ళ దూరంలో రామాపురం ఉంది. నీకు తెలుసుకదూ ? అక్కడ మరొక పేషంట్‌కూడా చాలా సీరియస్‌గా ఉంది. ఇక్కడినుండి తిన్నగా అక్కడికే కార్లో వెళ్తున్నాను. మళ్ళీ కార్లో తిన్నగా యిక్కడికే వస్తాను.

కృష్ణ:—ఈ రాత్రంతా మీ రిక్కడే ఉండాలి.

గోపాల్:—అలాగే అక్కడినుండివచ్చి యిక్కడే ఉంటాను. మరేం ఫరవాలేదు ; నువ్వు మాత్రం నిద్రపోకుండా చాలా జాగ్రత్తగా కనిపెట్టుకుని ఉండు. ... ఈ మందు ప్రతి రెండు గంటలకు ఒకసారి యిస్తూ ఉండు. జాగ్రత్త ! వస్తా.

[నేపథ్యంనుండి సుశీల "మోహన్ నన్ను మోసం చేశావా, అడి తప్పేవా" అని పలవరిస్తుంది.]

గోపాల్:—ఆ పలవరింతలు విన్నావా ?

కృష్ణ:—మొన్నట్నుంచి యిలాగే ఉండుండి పలవరిస్తోంది.

గోపాల్:—'మోహన్' అంటూంది, ఎవరా మోహన్ ?

కృష్ణ:—మా బావ. మీకు తెలుసుననుకుంటాను.

గోపాల్:—అతనా ! సుశీలకు తెలివివచ్చేసరికి, అతను యిక్కడ ఉంటే మంచిది. లేకపోతే మళ్ళీ తెలివి తప్పవచ్చు.

కృష్ణ:—వాడు యీ ఊళ్లోలేడే ! వాడు రావాలంటారా ?

గోపాల్:—తప్పకుండాను,

కృష్ణ:—అయితే దయచేసి Express wire యిస్తారా రాసి యిస్తాను.

గోపాల్:—అలాగే.

[కృష్ణమూర్తి వ్రాసి యిస్తాడు. డాక్టర్ వెళ్తాడు. ప్రతి రెండు గంటలకు కృష్ణ మందిస్తాడు. రాత్రి గడుస్తుంది. గడియారం తిరుగుతూ ఉంటుంది. తెల్లవారి 5 గంటలు అవుతుంది ఆత్రుతతో మాధవరావు వస్తాడు.]

మాధవ:—[వస్తూ, ఆత్రుతతో] ఏం నాయనా ఎలాగుంది ?

కృష్ణ:—అలాగే ఉంది.

మాధవ:—రాత్రి డాక్టర్‌గారు వచ్చారా ?

కృష్ణ:—రాత్రి మీరు వెళ్ళగానే వచ్చి యింజక్షన్ యిచ్చి వెళ్ళారు. మళ్ళీ రాత్రి రెండు గంటలకు వచ్చి మరొక యింజక్షన్ యిస్తానన్నారు. కాని యింతవరకు మళ్ళీరాలేదు. కారణం తెలీలేదు.

మాధవ:—త్రోవలో యిప్పుడు వాళ్ళింటికి వెళ్ళి వచ్చాను. రాత్రినుండి యింటికి రాలేదుట! ఇక్కడే ఉన్నారనుకున్నాను.

కృష్ణ:—ఆ గ్రామంనుండి రాలేకపోయారేమో! రాత్రి రామాపురం ఏదో అర్జంటు కేసుమీద వెళ్తున్నా నన్నాడు.

మాధవ:—ఇంకేం చెప్పాడు?

కృష్ణ:—ఇదేదో మెంటల్ షాక్ లా ఉంది. తనలోపం లేకుండా ప్రయత్నిస్తానన్నాడు. రాత్రి కారులో ఆ గ్రామంనుండి తిన్నగా యిక్కడకే వచ్చి రాత్రంతా యిక్కడే ఉంటానన్నాడు.

మాధవ:—చాల మంచివాడురా! మన ఊళ్ళో ఉన్న డాక్టర్లలో యితనొక్కడే ఘనుడు. ... ఇంతకీ మన అదృష్టం ఎలా ఉందో! ... మొన్న రమేష్‌గాడు తెచ్చి యిచ్చిన ఉత్తరంవల్లనే యీ మెంటల్ షాక్ వచ్చి ఉంటుంది.

కృష్ణ:—రాత్రంతా ఒకటే పలవరింతలు.

మాధవ:—ఏమని?

కృష్ణ:—"మోహన్ నన్ను మోసం చేశావా? ఆడి తప్పేవా?" ఇలాగే ఏమేమో ఆ మోహన్ గురించే.

మాధవ:—మోహన్ వస్తే బాగుంటుంది. ఎలాగ?

కృష్ణ:—రాత్రి డాక్టర్‌గారు కూడా యిలాగే అంటే రాత్రి ఆయన చేతనే Express wire యిప్పించాను. వస్తే వాడు యీ పాటికి రావచ్చును.

మాధవ:—వాడెందుకొస్తాడు? దీనిమీద వాడికిప్పుడు దయ ఎందుకుంటుంది? దీన్ని మోసం చేసిన వాడు ఏమోహం పెట్టుకుని వస్తాడు. వెధవ! విశ్వాసహీనుడు! తుచ్ఛుడు! నా అన్నంతిని, నా కడుపులో చిచ్చు పెట్టాడు! ఇటువంటి విశ్వాస ఘాతకుడిన్ని ఏం చేసినా పాపంలేదు.

కృష్ణ:—వాడిని ప్రేమించి, మోసపోయి, బెంగపెట్టు కుని యింతవరకు తెచ్చుకుంది, యీ అమాయకపు పిల్ల!

మాధవ:—ఇంతకూ వాడొకసారి వస్తే బాగుండును. వస్తాడంటావా?

కృష్ణ:—నాకు నమ్మకంలేదు ... (దుఃఖంతో) సుశీల బ్రతికే ఆశ నాకులేదండీ! రాత్రి వెళ్లిన డాక్టరు యింతవరకురాలేదు. అన్నీ మనకు ప్రతికూలంగా ఉన్నాయి. నాన్నగారూ! సుశీల బ్రతికే ఆశ నాకు లేదండీ!

మాధవ:—మనం ఏం చేయగలం? ఇంతకీ మన అదృష్టం ఎలా ఉందో! [వంటి నిండా దెబ్బలు తగిలి నందువల్ల కట్లు కట్టిఉంటాయి. సుశీలా! సుశీలా! అంటూ మోహన్ వస్తాడు]

కృష్ణ:-(సంతోషంతో) మోహన్!

మాధవ:-(సంతోషంతో) మోహన్! నాయనా వచ్చావా! సుశీలను బ్రతికించడానికి వచ్చావా నాయనా! కృష్ణా! మోహన్ వచ్చాడు మన సుశీల తప్పకుండా బ్రతుకుతుంది. మోహన్ నీ గురించే కలవరిస్తోంది! వెళ్లు.

మోహన్:—ఏదీ నా సుశీల? ఎలాగుంది? ఏదీ?

మాధవ:—అదిగో! వెళ్లు; పలకరించు, "మోహన్ను వచ్చా"నని చెప్పు.

మోహన్:—[లోపలకు వెళ్ళి] - సుశీలా! నేనూ మోహన్ని-వచ్చాను. చూడు ... ఒక్క సారి చూడు. కోపం వచ్చిందా? సుశీలా నాతో మాట్లాడవ్?

నేపథ్యం:- సుశీల "మోహన్ నన్ను మోసం చేశావా? ఆడి తప్పేవా?"

మోహన్:—[వస్తూ] ఏమిటి మామా తెలివిలేదే! నన్ను గుర్తించలేదే! ఏమిటీ వ్యాధి? ఎన్నాళ్లయింది? నాకెందుకు ఉత్తరం వ్రాయలేదు? ... చెప్ప మామా?......ఒరే కృష్ణా! నువ్వైనా చెప్పరా! మాట్లాడలేం? ... ఏమిటి యిదంతా?

మాధవ:—నా ఖర్మం! దానికి మనోవ్యాధి Brain effect అయింది.

మోహన్:—కారణం?

కృష్ణ:—నువ్వే కారణం?

మోహన్:—నేనా!

కృష్ణ:—ఔను; నువ్వే!

మోహన్:—నే...నా!

కృష్ణ:—ఏమిటీ నాటకం! ఏమి తెలియనట్టు నటిస్తావేం! దాన్ని పెళ్లి చేసుకుంటానని చెప్పి మోసగించావ్!

మోహన్:—నేనేం మోసగించలేదు. సుశీలను నేనెప్పుడు నిరాకరించలేదు.

కృష్ణ:—అలాంటి వాడివి ఆ సంబంధం ఎలా ఒప్పుకున్నావ్?

మోహన్:—ఏ సంబంధం? నాకంతా అయోమయంగా ఉంది.

కృష్ణ:—ఔను నీకు అంతా అయోమయమే! ఏమీ తెలియనట్టు నటించేవాడికి అంతా అయోమయమే! [ఉత్తరం తెచ్చి యిచ్చి] చూడు. ఈ ఉత్తరమేమిటి!

మోహన్:—[ఆశ్చర్యపడుతూ చదివి] ఇదంతా ఎవరిదో బనాయింపు! కుతంత్రం! మోసం! మామా నాకే పాపం తెలియదు...ఇదంతా మోసంమామా! నన్ను నమ్ము! నావల్ల యింకేదైనా తప్పుంటే శిక్షించు, నేను పడతాను.

మాధవ:—ఎలా నమ్మమన్నావ్?

మోహన్—మామా! నా హృదయం చీల్చి చూడు. ఒక్క సుశీలకు తప్ప యితరులకు యీ హృదయంలో స్థానంలేదు.

కృష్ణ:—అలాంటి వాడివి ఉత్తరాలు వ్రాయడం మానుకున్నావేం?

మోహన్:—నేనా? మీరా? వారానికి రెండుమూడు ఉత్తరాలు వ్రాసినా మీరు జబాబువ్రాయండే. మీ క్షేమ సమాచారాలు తెలియక నేను ఎంత బాధపడ్డానో మీకేం తెలుసు.

మాధవ:—మాకు ఒక్క ఉత్తరం చేరందే!

కృష్ణ:—వ్రాసినవి నీ దగ్గరే పెట్టుకున్నావేమో!

మోహన్:—ఇదేదో కుట్ర! నేను నిజంగా వ్రాసి స్వయంగా పోస్టు చేశాను.

మాధవ:—అయితే యిదంతా రమేష్ కుట్రయి ఉండాలి. వాడిని సుశీల పెళ్లాడుతుందని కుట్ర పన్ని ఉంటాడు.

మోహన్:—నా ఉత్తరాలు మీకు అందకపోయినా యీ సంబంధం గురించి "నిజమేనా?" అని నాకు ఒక్క ముక్క వ్రాసినా నేను వచ్చి, యీ కుట్ర జరగకుండా చేసేవాడిని. మీ టెలిగ్రాం వచ్చేవరకు నాకేం తెలియందే.

మాధవ:—ఇదంతా నా దురదృష్టం!

మోహన్:—అశ్రద్ధచేత, చికాకుల చేత మీరు వ్రాయడంలేదేమోననుకున్నాను. వద్దామంటే కొత్త ఉద్యోగం, సెలవు పెట్టడానికి వీలులేకపోయింది. మామా! మందెవరిస్తున్నారు?

మాధవ:—డాక్టర్ గోపాల్

కృష్ణ:-ఇంకా డాక్టర్ రాలేదే! (అంటూ వెళ్తాడు)

మాధవ:—[ఆశ్చర్యంతో మోహన్ వంటినిండా ఉన్న కట్లు తడిమి చూచి] మోహన్, యిదేమిటి? వంటినిండా యీ దెబ్బలేమిటి?

మోహన్:—ఏం చెప్పను? రాత్రి మీ పెలిగ్రాం అందేసరికి Train time దాటిపోయింది ... అదృష్టవశాత్తు ఒక Private లారీ దొరికింది. అందులో ఎక్కి చాలాదూరం వచ్చాను. ఒక జంక్షన్‌లో నన్ను ఆ డ్రైవర్ వదిలి పెట్టాడు. కొంతదూరం ఆ చీకట్లో నడిచాను. ఏదో గ్రామం చేరాను. ఒకయింటిముందు ఒక కారు కనబడింది. ఆ యింట్లో ఏదో సందడిగా ఉంది. ఎవరినైనా ఆ యింట్లోవాళ్లని యీ ఊరుకి త్రోవ అడుగుదామనుకున్నాను.

మాధవ:—చెప్పలేదా?

మోహన్:—నేను ఎవరినీ అడగలేదే. కార్లో ఎవరైనా ఉన్నారేమో అని తొంగి చూశాను. స్విచ్ తాళాలు మాత్రం ఉన్నాయి. ఆశపుట్టింది! ఆ కారును డ్రైవ్ చేసుకుంటూ శీఘ్రంగా యిక్కడకు రావచ్చునని ఆశపడ్డాను. స్టార్ట్ చేశాను.

మాధవ:—దొంగతనం చేశావా?

మోహన్:—ఔను.-నా సుశీల కోసం [మతి స్థిమితం తప్పినట్టుగా] నా సుశీలను ఎంత వేగంగా చూస్తానా అని......

మాధవ:—నీవు ప్రమాణాన్ని తప్పేవా?

మోహన్:—[వినిపించుకోకుండా] వేగంగా పోనిచ్చాను. శరవేగంగా కొంతదూరం పోనిచ్చాను. ఎదురుగా ఒక లారీ భూతంలా వచ్చింది. అంతే ... [ఆ దృశ్యం కళ్లకు కట్టినట్టుగా] అబ్బా! [బాధ పడతాడు]

మాధవ:—తర్వాత?

మోహన్:—తర్వాత కళ్లు తెరచి చూసేసరికి యీ ఊరిలోని ఆస్పత్రిలో ఉన్నానని తెలుసుకున్నాను. అతి కష్టంమీద అందులోనుంచి తప్పించుకుని యిలా వచ్చాను.

మాధవ:-[ఉద్రేకంతో] ఏం పని చేశావురా? దొంగతనమా చేశావు? నీ ప్రమాణాన్ని తప్పేవా?

మోహన్:—నా ప్రమాణాన్ని తప్పేనా? నేను చేసిన ప్రమాణాన్ని తప్పేనా? ... ఔను! తప్పేను! అది తప్పేను! నాకు అతి ప్రియమైన నా సుశీల మీద చేసిన ప్రమాణాన్ని తప్పేను. [దుఃఖంతో] మామా! తెలియక చేశాను! మరచిపోయి చేశాను—ఉన్మత్తుణ్ణయి చేశాను. ఆ ప్రమాదంలో నేను చనిపోయినా బాగుండేది! సుశీలా నా తప్పును క్షమించు! క్షమించు (అంటూ వెళ్లిపోతాడు)

గోపాల్:—(వస్తూ) ఏం ఎలాగుంది?

మాధవ:—అలాగే ఉంది. ఏం? మీరింత ఆలస్యంగా వచ్చారేం?

గోపాల్:—ఏం చెప్పను! సుశీలను చూసివచ్చి చెప్తా. (లోనికి వెళ్లివచ్చి) అర్ధరాత్రి పూట నా కారును, ఆ పల్లెటూరు వద్ద ఎవరో దొంగిలించారు. ఎలా రాను? తెల్లవారిన తర్వాత మొదటి బస్సులో వచ్చాను. నా కారు ట్రంకురోడ్ జంక్షన్‌లో పిప్పి పిప్పిఅయి పడుంది. ఆ కారు ఒక లారీతో డాష్ కొట్టిందిట. ఆ దొంగని ఆస్పత్రిలో పడేశారుట. ఇక్కడనుంచి నేనక్కడకే వెళ్లాలి.

మోహన్:—(వస్తూ, డాక్టర్! ఆ దొంగను నేనే!... దానికి తగిన ప్రతిఫలం అనుభవిస్తున్నాను.

గోపాల్:—నువ్వా!

కృష్ణ:—(నేపథ్యంనుండి) డాక్టర్! డాక్టర్!

గోపాల్:—(వెళ్లివచ్చి) లాభంలేదు.-యీ యింజక్షన్ ఒక్క గంట ముందయినా యిచ్చి ఉంటే బ్రతికేది. వస్తాను. (వెళ్తాడు)

మాధవ:—యమ కింకరుడులా వచ్చావా నా కూతురు ప్రాణాలు తీయడానికి!

మోహన్:—(మొహం దించుకుని, బాధతో) ఔను; నేను నా చేతులారా నా సుశీల ప్రాణాలు తీయడానికివచ్చాను. చేసిన ప్రమాణాన్ని నిలబెట్టుకోలేనిదుర్బలుణ్ణి.

కృష్ణ:—(నేపథ్యంలోనుండి) నాన్నా! నాన్న! సుశీలా! సుశీలా (వెఱ్ఱికేకలు)

మాధవ:—(ఆత్రుతతో) అమ్మా సుశీలా! సుశీలా (వెళ్తాడు) అమ్మా సుశీలా (నేపథ్యంలో ఏడుపు)

మోహన్:—(బాధతో) ఆ! సుశీలా! వెళ్లిపోయావా! నేనూ ...వ...స్తు...న్నా. ...అబ్బా...వ...స్తున్నా... ఆః! (చనిపోతాడు)

# శ్రీ రామ కర్ణామృతము

( ఆంధ్రానువాదము )

శ్రీ కల్లూరి అహోబలరావు.



(గతసంచిక తరువాయి)

౮౧

భూషణతతులచే భూపుత్రి శోభించి
వామాంక సీమలో వఱలుచుండ
నామె సౌందర్యంబు నక్కఱఁ గాంచుచుఁ
బూర్ణచంద్రునివంటి మొగముతోడ
శోభించు శ్రీరామ ! శుభకరనామ ! దే
దీప్యంబుగా వెల్గు దివ్యమైన
మకుటంబు మెఱయంగ, మానితనవరత్న
సింహాసనంబున చెలువుగాఁగఁ
గూరుచున్నావు ; పవమానుఁ గూర్మి
సుతుఁడు
లక్ష్మణుండు, సుగ్రీవుండు లాలితముగ
నంగదుఁడు నిన్ను పూజింతు రధికభక్తి
రామ ! నా సేవ లొక్కింత ప్రేముఁగొనుమ!

౮౨

సీతావధూమణి శ్రీ వివాహపు వేళ,-
నామె దోసిలియందు నమరియున్న
తలబ్రాలు ముత్యముల్ వెలలేని పద్మరా,-
గమణులవలెఁ దోచెఁ గన్నుగవకు
నామీఁద యామణులా రామచంద్రుని,-
శిరమునబడునప్డు చిత్రముగను
మల్లెపూవులభంగిఁ దెల్లగాఁ గన్పడె -
నంతరాళపువన్నె నావహించి,
తరువాత జాఱి, ముత్యములు క్రిందికి జేరు
నపుడు, శ్రీరాము దేహంపుకాంతి
కతన, దివ్యనీలంబులై గానబడియె
నట్టి తలబ్రాలు ముత్యంబుల నవరతము
భక్తులకు, శుభంబులొసంగి పావనముగ
వారి రక్షించుగావుత ! వసుధలోన

౮౩

శ్రీరామ మంత్రంబు, శ్రేష్ఠమై జ్ఞానంబు
నీతియు బోధించు నిర్మలముగ,
శ్రీరామ మంత్రంబు స్థిరతరైశ్వర్యంబు
నారోగ్య సౌఖ్యంబు లందఁజేయు
శ్రీరామ మంత్రంబుఁ జింతించువారికి
సౌభాగ్యములుగల్గు సంతతముగ
శ్రీరామ మంత్రంబు సేవించు నంజనా
సుతునకు కైవల్య సుఖములిచ్చె
మహిమగల్గు రామ మంత్రంబు గొప్పది
దీని కుద్దివేరు గానరాదు ;
సతము రామభజన సల్పెడువారికి
భయము లేశమేని-వలదు-వలదు-

౧౪

వ్యామోహ మడగించి యతిశాంతిఁ
జేకూర్చు
నమల శ్రీరామ నామౌషధంబు
దైత్యుల మర్దించి, ధర్మంబు హెచ్చించు
నమల శ్రీరామ నామౌషధంబు
భవ భయంబును బాపి భక్తుల రక్షించు
నమల శ్రీరామ నామౌషధంబు
మూడు లోకములకు ముదము సంపాదించు
నమల శ్రీరామ నామౌషధంబు
శ్రేయమొసఁగునట్టి శ్రీరామ నామౌష
ధంబు నోయ మనస! త్రాగి త్రాగి
దుఃఖ రోగములను దొలగించుకొనుము ; నీ
వితర చింతచేయు టేల చెపుమ ?

౧౫

ముక్కంటి నీ రూపు ముదమార స్తుతి
యించు
సూర్యవంశ శ్రేష్ఠ సుందరాంగ!
బాలారుణాత్ముఁడై - ప్రభల వెల్గొందెడు
కమలా మనోహరా! విమల తేజ!
కౌసల్యకొమరుఁడై – కడుమనోహరుఁడవై
చిఱునవ్వు జిందించు చిత్ప్రకాశ!
దేవతాధీశుఁడై సేవించు లోకాళి
కానంద మొనగూర్చు యమృతరూప!
పాప సంహార బాధలఁ బరగఁద్రోలి
కనక మణిమయాలంకార ఘనతఁబొంది
వెలుఁగుచున్నట్టి శ్రీరామ వినుతిసేతు
సతము నిన్నుఁ బ్రాతఃకాల సమయమందు

౧౬

చిఱునవ్వు చూపులు జెలఁగుచుండెడివాఁడు
బహు సూర్యకాంతుల బరగువాడు
మరకత మణినీల వరశరీరమువాఁడు
ఆనందరూపుఁడై యలరువాఁడు
వామాంకమున సీతవఱల, నొప్పినవాఁడు
కమలలోచనములు గలుగువాఁడు
పీతాంబరంబును ప్రేమఁదాల్చినవాఁడు
అఖిలలోక నివాసియైనవాఁడు
శ్రేష్ఠమౌ, ధనుర్బాణముల్ చెలఁగువాఁడు
మణిగణంబుల లలితుఁడై – మా మనముల
సతము వెలుగొందు శ్రీరామచంద్రమూర్తి
సన్నుతులఁగొను మధ్యాహ్న సమయ
మందు

౧౭

పూర్ణ చంద్రునిబోలు, ముద్దుమోము
గలాఁడు
ముసిముసి నవ్వుల నెసగువాడు
కోటి సూర్యులవంటి మేటికాంతిగలాఁడు
సురముని వినతుఁడై బరగువాఁడు
భవమహాకానన బాధ మాన్పెడువాఁడు
శ్యామదేహంబుతో నలరువాఁడు
దేవతాధీశుఁడై దివ్యకాంతిగలాఁడు
సీత సేవింపంగఁ జెలఁగువాఁడు
భక్త సులభుండు, శ్రీరామవల్లభుండు
శ్రేష్ఠసింహాసనస్థుఁడై చెలఁగియుండు
సంతసమున, సాయంకాల సమయమందు
సతనిఁ బ్రార్థింతు నిశ్చలమతిని రతిని.

(సశేషము)

# బిడ్డలు - తల్లిదండ్రులు

## క్రీడ

శ్రీ కె. వెంకట్రామయ్య

(డిశంబరు సంచిక తరువాయి)

### క్రీడానురక్తులు (Play Interests):-

తమకు యాటలకు తగిన యుపకరణములును, ఆట వస్తువులును ఉండినగాని బిడ్డలానందముగ నుండజాలరని ఇదివరకే చెప్పితిమి. అట్టి యాటవస్తువులును, ఉపకరణములును వారి వారి వయస్సులనుబట్టి కలిగెడి యవసరముల కనుగుణములై యుండవలెను. అనగా వివిధవయస్సులందును బిడ్డ లెట్లాడునదియు బాగుగ గమనించి ఆ యాటలకు తగిన యాటవస్తువులను, ఉపకరణములను ఇచ్చుచుండవలెను.

శారీరక, మానసిక, భావైక, పరిణామములబట్టి బిడ్డల యాట లక్షణములు మారుచుండును. శారీరక పరిణామమున కనుగుణముగ వారు తమ చేతులు, వ్రేళ్లయందలి చిన్న కండరములనైన వాడుదురు. లేదా మొండెము తదితర యంగములందలి పెద్ద కండరములనైనను వాడుదురు. బిడ్డలు తమ యాటలలో జూపెడి భావములు (ideas) వారి మానసిక పరిణామము ననుసరించియుండును. రెండేండ్లబిడ్డ బొమ్మను సంరక్షించుచున్నట్లును, దాని కాహారము పెట్టుచున్నట్లును ఆటలాడును. ఇక కొంచె మెదిగినబిడ్డ ఆ బొమ్మను నిత్యజీవితమున నొక పాత్రగా భావించి యాడదొడగును. మూడేండ్లబిడ్డ ఇంటిని కట్టునేగాని దానికి ఇంటి పోలికయే యుండదు. ఐదేండ్లబిడ్డయైనచో ఆ యింటినే అన్ని భాగములతో నతి పొందికగా కట్టగలడు. ఇట్లే బిడ్డల సాంఘికావసరములును (social needs) వారి వయస్సులబట్టి వేరగుచుండును. రెండేండ్లలోపు బిడ్డలు ఒంటరిగా నాడుచు కులాసాగా నుండగలరు. కాని రెండేండ్లు దాటగనే సమవయస్కులగు నితర పిల్లల సహవాసమును గోరుచుందురు. శైశవదశలో బిడ్డల క్రీడానురక్తులు చాలవరకొకేరీతిగ నుండును. కాని వారెదిగి వ్యక్తిత్వమును బొందుకొలదియు ఆయానురక్తులలో ప్రత్యేకత పొడసూపును.

ఆరంభమున మగపిల్లలును ఆడుపిల్లలును ఒకేరీతిగ నాడుచుందురు. వారి మనోభావములందును, భావోద్రేకములందును, ఎట్టి భేదము నుండదు. వారందరు స్త్రీ పురుషభావములేని బిడ్డలై యుందురు. కాని మూడేండ్లు దాటగనే ఆడుపిల్లలును, మగపిల్లలును వేరువిధముల నాడుట కారంభింతురు. బిడ్డల యాటల యందట్టి భేదము సహజముగానే రావలెనుగాని దానిని మనమే తెచ్చిపెట్ట ప్రయత్నింపరాదు. దాని వలన బిడ్డలకు చెరుపుచేసినవారమగుదుము. ఏయిద్దరు బిడ్డలు నేకరీతిగ నెదుగుచుండరు. సరియైన పరిసరముల నేర్పరచుటచే ప్రతి బిడ్డయు సహజముగ తానెప్పుడు మార్పుజూపవలెనో అప్పుడే జూపుచుండును. కొందరు మగపిల్లలు మూడేండ్లు వచ్చినను బొమ్మలపై (Dolls) మక్కువ జూపుచునే యుందురు. దీనినిబట్టి ఆ బొమ్మలు వారి భావోద్రేకావసరములకు (emotional needs) ఇంకను ముఖ్యమని గుర్తింపనగును. బిడ్డకు తగిన యితరయాట వస్తువులనిచ్చి అతని దృష్టిని బొమ్మలపైనుండి మరలింపవచ్చును. కాని బొమ్మను బలవంతముగా తీసివేయుట చాల తప్పు. దానివలన బిడ్డల నుద్రేకపరచి బాధించినవారమగుదుము. ఐనను బిడ్డ డెదిగియు బొమ్మను వదలకుండుటకు కారణమేమో తెలిసికొనుటయు నవసరమేయగును. బిడ్డ డెదిగినను తల్లి యతనినింకను శిశువుగనే జూచుచుండవచ్చును. తానెదిగినవాడననుట కాతడా బొమ్మ నొక శిశువుగా భావించుచుండవచ్చును. అట్లుగానిచో ఆ పిల్లవానియెడ నెవ్వరును తగినంత ప్రేమ జూపకుండుటచే ఆ బొమ్మ అతని ప్రేమ కవసరమైయుండవచ్చును. వేడుకగా కాలము గడపుటకే బిడ్డలాడుచుందురని మన మను



6

కొనరాదు. వారి యాటలెంతో అర్థవంతములై యుండును.

శైశవక్రీడ (The play of Infancy):-

పసి బిడ్డలు కాళ్లను చేతులను కొట్టుకొనుచు ఆడుట కారంభింతురు. ఆ యాట కేవలము కండర చలనమే గాని ఆలోచనతో గూడినది గాదు. స్నానము చేయుచున్నప్పుడు బిడ్డ నీటిని త్రుళ్లగొట్టుచు సంతోషముగా నాడుకొనును. కాలి వ్రేళ్ళను చేతివ్రేళ్ళను, నోట బెట్ట ప్రయత్నించుటయు నతని కాటయేయగును. ఈ యాటవలన బిడ్డ తన చేతులు, కాళ్ళయందలి కండరముల నభివృద్ధి జేసికొనుచు స్వశక్తిని గుర్తింప గలుగును. శీఘ్రకాలములోనే అతడితరుల ననుకరించుచు, చప్పట్లు కొట్టుట, దోబూచులాడుట మొదలగు క్రీడల నారంభించును. నోటితో బుడగల నూదుచు గడగడ శబ్దముల జేయుచు, కూయుచు, ధ్వనులు చేయుచు, ఏవో పలుకుచు బిడ్డ యెంతో ఆనందమును బొందుచుండును.) ఒక శబ్దమును జేయుట తెలియగనే అతడు దానిని తిరిగి తిరిగి చేయుచుండును. శబ్దము జేయుట యతని కెంతో ఆనందము నిచ్చును. అందులకై యతడు వస్తువులను కొట్టుట, పడక పైనుండి పడద్రోయుట ఇత్యాది పనులను జేయ నారంభించును. బిడ్డ ఆటవస్తువులను క్రిందికి త్రోయ నారంభించినపుడు ఆ యాట వస్తువులకు త్రాడుగట్టి యిచ్చుట మంచిది. అందుచే క్రిందపడిన వానిని తిరిగి పైకి లాగుకొనుట బిడ్డకలవాటగును.

పై జెప్పిన విధముల బిడ్డయాడుట పరీక్షార్థమే యైయుండును. ఆ యాడుటయందలి చలనముతే బిడ్డ కానందమునిచ్చును. సమీపముననుండెడి యాట వస్తువును బట్టియే ఆటసాగును. అందాలోచనయేమియు నుండదు. ఏడాది బిడ్డ యేవస్తువును జ్ఞప్తియందుంచు కొన జాలడు. అట్లగుటచే తన దగ్గరలేని యాట వస్తువునకై యతడాలోచింపడు.

బిడ్డల కాటవస్తువు లెన్నోవిధముల నుపకరించు చున్నవి. క్షణకాలమానందమిచ్చి ఊరడించుటకే అవి యేర్పడలేదు. తల్లిపై నాధారపడక ఒంటరిగా నుండుట కవియెంతో సహాయపడును. ఆటవస్తువులే లేనియెడల బిడ్డ కానందమిచ్చునది ఒక తల్లియేయగును. అందుచే బిడ్డకు తల్లి నంటియుండుటయే ఎక్కువగా నలవాటై యెదిగిన పిదపగూడ యెవ్వరితో కలియకుండును.

పసిబిడ్డలకెట్టి యాటవస్తువు లవసరమగునదియు మొదట నాలోచింపవలెను. ఏయోచనలేక ఏవో యాటవస్తువుల నిచ్చిన అవి యంత ప్రయోజనకరములు కాజాలవు. ఇంద్రియముల నాకర్షించు యే వస్తువులైనను పసిపిల్లల కిష్టముగా నుండును. దృష్టికిని, శ్రవణమునకును, స్పర్శకును, చలనమునకును ఇంపై ఉత్సాహమునిచ్చెడి యాటవస్తువులు వారి కెంతయు తగియుండును. మంచి రంగులుండి కదలియాడు నాటవస్తువులును, వివిధ శబ్దముల జేయు రకరకముల గిలకలును వారికుండవలెను. ఆ యాట వస్తువులు వారి తొట్టిపైగాని త్రోపుడు బండిపైగాని కట్టుటకు వీలుగా నుండవలెను. ఇంతేగాక ఒక దానిలో నొకటి సరిగా పట్టెడి పెట్టెల దొంతరలు (Nest of boxes) కంతలలో దూర్చియాడుటకు వీలగు కొయ్యచీలు మొదలగు ఆటవస్తువులుగూడ వారి కవసరమే. పసిపిల్లలు ఇంటియందలి వస్తువులతో నెట్లాడుచుండునదియు గమనించిన యెడల వారికి తగిన యాటవస్తువుల నెన్నిటినో సులభముగా తయారుచేయవచ్చును.

శైశవము గడచువరకును బిడ్డచేయు చేష్టలెంతయు వింతగ నుండును. అతని యాట యంతయు చలనము కొరకును, స్వశక్తిని దెలిసికొనుటకును నైయుండును. వస్తువులను క్రిందగొట్టి శబ్దము జేయగలుగుట అతని కెంతో యానందకరమగును. వస్తువులపై స్వాధీనత గలుగువరకును బిడ్డ వానితో నాడుచుండును. ఆ స్వాధీనత రాగానే వానిని వదలుచుండును. ఇట్లే యొక బిడ్డడు డబ్బా మూతను తీయుట, తిరిగి పెట్టుట నేర్చుటకై డెబ్బదితొమ్మిదిమార్లు ప్రయత్నించెను.

లేచి కూర్చుండుటకు మొదలిడిన బిడ్డకు వట్టి యాట బొమ్మల నిచ్చిన చాలదు. ఏదో యొక పనిని జేయు వీలగు నాటవస్తువులనుగూడ నిచ్చుచుండవలెను.

# పుట్టబోయే శిశువులు

శ్రీమతి యం. లక్ష్మీదేవి



[ఒక పాఠశాల. ఆరవతరగతి. పంతులుగారు, పిల్లలు కూర్చొని ఉంటారు. అప్పుడే గంటకొట్టి ఐదు నిముషాలు అయింది. భాస్కర్ తన పుస్తకాలతో ఒక అబ్బాయిని వెంట బెట్టుకొనివస్తాడు. అతనికి తొమ్మిదేళ్లుంటుంది.]

పంతు:—ఏంరా! భాస్కరం, ఇంత ఆలశ్యం చేశావేం?

భాస్క:—ఈ అబ్బాయికూడ నాతో వస్తానన్నాడండీ! అంచేత కొంచెమాలశ్యమైంది.

పంతు:—ఎవరీ అబ్బాయి?

భాస్క:—మా ఏదురింటి అబ్బాయండి! వాళ్లు ఈ వూరికొచ్చి వారంరోజులయింది.

పంతు:—ఇదివరకు ఎక్కడున్నారు? వీళ్ల నాన్నకు ఏం ఉద్యోగం?

భాస్క:—వీళ్లు ఇదివరకు తమిళదేశంలో ఉండేవారటండీ; వీళ్ల నాన్నను ఈ వూరికి బదిలీచేశారు - బ్యాంకులో ఉద్యోగమండి.

పంతు:—అయితే వీళ్ళు అరవవాళ్లా?

భాస్క:—అవునండి.

పంతు:—మరి, ఆ అబ్బాయికి తెలుగు రాదన్నమాట.

భాస్క:—రాదండి. ఇప్పుడిప్పుడు కొద్దిగా నేర్చుకొంటున్నాడు.

పంతు:—నీకు ఆ అబ్బాయికి స్నేహం మెలాగ కుదిరింది? నువ్వు ఆ అబ్బాయి ఏం జెప్తాడో కనుక్కోగలవా?

భాస్క:-కనుక్కోగలనండి. అయితే నేను తెలుగులో జవాబుచెప్తే అతనూ గ్రహించుకోగలడు.

పంతు:—అయితే నువ్వు ఆ అబ్బాయి నెందుకు బళ్ళోకి పిల్చుకొచ్చావు?

భాస్క:-ఇంట్లో ప్రొద్దుపోవడంలేదన్నాడు- నాతోగూడ వస్తానన్నాడు.

పంతు:—(కోపంతో) మంచిపనిచేశావు. ఆ అరవ వెధవతో నీకేం నేస్తం?

భాస్క:-(దిగ్భ్రమతో) అట్లా అంటారేమండీ - పంతులుగారూ! మీరే అన్నారు గదండీ, అందరు ఐకమత్యంగా కలిసి మెలసి ఉండాలని.

పంతు:-అవును, ఆంధ్రులంతా కలిసిమెలిసి

ఐకమత్యంగా ఉంటేనే ఆంధ్రరాష్ట్రం బలపడుతుంది, ఆంధ్రులకు ఔన్నత్యం సంప్రాప్తమౌతుంది.

భాస్క:-అయితే పొరుగువాణ్ణి విరోధించుకోవాలన్నమాట.

పంతు:-నేనల్లాగ చెప్పానా ?

భాస్క:-మరి, అదే అర్థమౌతుందిగా! మనం స్వార్థపరులై పోవాలి. పొరుగు వారికి ఏసహాయము చేయగూడదు. వారితో స్నేహమే చేయగూడదు. వారి సుఖదుఃఖాల్లో మనం పాల్గొనగూడదు. తమిళరాష్ట్రం మన రాష్ట్రానికి పొరుగు రాష్ట్రం. వాళ్లతో మనం కలిసిమెలసి ఉంటేగదా మనకు శ్రేయస్కరం! మన ఆంధ్రరాష్ట్రం భారతదేశానికి మధ్య భాగంలో ఉంది. ఇరుగు పొరుగు రాష్ట్ర ప్రజలతో మనం సహకార సహోద్యమాల్లో పాల్గొనకపోతే మనకెలా జరుగుతుందండీ ?

పంతు:-అరవవాళ్లెప్పుడు మన రాష్ట్రం మీద ద్వేషం చూపెడుతూనే ఉంటారు. పనిబడినప్పుడు మనవద్ద ప్రాకులాడుతారు. తరువాత పల్కరించినా పలుకరు.

భాస్క:-మనం ప్రేమిస్తే వాళ్ళుగూడ ప్రేమిస్తారు. వాళ్ళ దోషాల్ని మనం క్షమించితే వాళ్ళూ బాగుపడతారు. మన ఆంధ్రులే అరవవాళ్లకు ఎంతో చేదోడు వాదోడుగా ఉన్నారో గ్రహించారా! ఆంధ్రసినిమాతారలే అరవ చిత్రాల్లోగూడ నటించి భేదభావాలు మానుకొని సహకరిస్తున్నారు. ఇంకా మనవాళ్ళే విజయనగర రాజుల కాలంలో మధురను రాజధానిగ జేసుకొని పరిపాలించిన నాయకరాజుల సంతతివారు రాష్ట్రాభ్యుదయానికి పాటుపడుతున్నారు. రామాయణమును కీర్తనల్లోపాడిన త్యాగరాజ కృతులను - అవి ఆంధ్ర భాషలోఉన్నా భాషాద్వేషములేక అభ్యసిస్తున్నారు. చరిత్రకాలంనుంచి ఆంధ్ర తమిళ రాష్ట్రములు పరస్పర సహకార ఐకమత్య భావంతో కలసిమెలసి ఉండేవని మీరే చరిత్ర పాఠం జరిపేటప్పుడు చెప్పారు గదండీ!

పంతు:-పోరా! వెధవ-అదంతా చరిత్ర కాలం. ఈ కాలంలో మన ఔన్నత్యాన్ని మనమే చూసుకోవాలె! ఇరుగు పొరుగువాణ్ణి సత్కరిస్తూ బహుమానిస్తూంటే మనం అణగద్రొక్కబడతాం. భారతీయులు ఆంగ్లేయులను అతిథి సత్కారములు గావించి ఆదరించినందుకుగదా అణగద్రొక్కబడ్డారు. ఇకమీదనైన బుద్ధి తెచ్చు

కొని తమ స్వభావాలను మార్చుకొని చేజిక్కిన స్వాతంత్ర్యాన్ని దక్కించుకోవాలి.

భాస్క:-మీరు చెప్పింది నిజమేనండి. కాని భారతదేశం మీద అన్యదేశీయులు ఆక్రమిస్తే అడ్డు పెట్టాలిగాని అంతర్రాష్ట్రీయ పోరాటాలతో స్వతంత్ర భారతభూమిని పెంపొందించ గలమా! ఆరోజు పృధ్వీరాజు, జయచంద్రుని పారంజరిగేటప్పుడు మీరన్నారుగదండీ - జయచంద్రుడు మహమ్మదు ఘోరీని దండెత్తి రమ్మని కబురు చేశాడు - ఆ జయచంద్రుని మూలాన్నే మనదేశం అన్యాక్రాంతమైందని.

పంతు:-అందుకనే నేను చెప్పడం! ఇతర రాష్ట్రాలవార్ని ఆదరించగూడదని.

భాస్క:-జయచంద్రుడు మూర్ఖుడు. బుద్ధిహీనుడైతే మమ్మల్నికూడా అలాగే ఉండమంటారా! పృధ్వీరాజు తన పొరుగురాజు, స్వబంధువు. మీదు మిక్కిలి అల్లుడుకూడ. జయచంద్రుడు పృధ్వీరాజుతో ఐకమత్యం కల్గియుండి పృధ్వీరాజు పక్షము వహించి తురుష్క రాజును ఎదురించి యుండినట్లైన మనదేశమెట్లు అన్యాక్రాంతమౌను? అంతర్జాతీయ, అంతర్రాష్ట్రీయ కలహముల వలననేకదా మన భారతదేశం బానిసదేశం ఐంది. ముంజేతికంకణమునకు అద్దమేల? అనునట్లు చరిత్ర స్పష్టముగామనకు భారతీయ పతనమును విశదీకరించుచున్నపుడు మనము వితర్కించుకొనిమంచిదారిని పట్టక ఆ పెడపోవుటయేల?

పంతు:-(కోపంతో) చాల్లేరా! వాగుడు. గ్రుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించిందట. ఆ అబ్బాయిని ఇంటికి పొమ్మని నువ్వ క్లాసులో పోయి కూర్చో!

భాస్క:-పంతులుగారండీ! ఆ అబ్బాయిని గూడ నాతో ఉండనివ్వండి.

పంతు:-వీల్లేదు; అరవ వెధవను నాక్లాసులోకి రానివ్వను.

భాస్క:-(ఉద్రేకంతో) అయితే నేనుకూడ లోపలికి వెళ్లను.

పంతు:-రాకపోతే పో. గెట్ అవుట్.

క్లాసులో ఒకడు:-ఆంధ్రులంతా కలిసిమెలసి ప్రేమతో వర్తించడం మనధ్యేయం అన్నారు సార్ మీరు. అవమానంలోను అభ్యుదయంలోను అందరము ఏకీభవిస్తాము. ఒరేయి! పదండ్రా! అందరము గెట్ అవుట్. పంతులుగా రొక్కరే ఏం జేస్తారో చేసుకోని.

(అందరు పిల్లలు క్లాసు విడిచి బయటకు

వెళ్ళిపోతారు. అటువైపు వచ్చిన హెడ్మాష్టరు పంతులుగార్ని చూచి)

హెడ్మా:—ఇదేమిట య్యా! క్లాసును బయటికి వదిలిపెట్టేశావు!

పంతు:—(తల గోక్కుంటూ) ఏంజెప్పమంటారండీ! భాస్కరం ఒక అరవ అబ్బాయిని వెంట బెట్టుకొని వచ్చాడు. ఆ అబ్బాయిని క్లాసులో కూర్చో వద్దన్నాను. అంతమటుకే అందరూ లేచి వెళ్ళిపోయారండీ! ఏం కాలమో ఇది వింత కాలంగా ఉంది!

హెడ్మా:—వింత ఏమిటండీ! భావి భారతీయ నాయకులు, భావిభారత ప్రజలూను. పరమార్థికులు, పరమోదార హృదయులు సుస్వభావులై వర్ధిల్లుతారు. మన కాలం పరస్పర రాగ ద్వేషాలతోనే గడిచి పోతుందిలెండి. వాళ్ళందర్ని సమాధానపర్చి ఆ అబ్బాయిని గూడ క్లాసులో కూర్చోబెట్టి పాఠం జరిపించండి.

పంతు:—రామ రామ (అని నిట్టూర్పు పుచ్చుతాడు)

---

# మా వినోద యాత్ర

శ్రీ వేదము వేంకటకృష్ణశర్మ



(గతసంచిక తరువాయి)

ఔరంగాబాదుపట్టణం రైల్వే స్టేషనుకు దాదాపు మూడు మైళ్ల దూరంలోవుంది. మంచిషహరు. చెప్పుకోదగ్గ వ్యాపారస్థలం. డివిజనుకు హెడ్ క్వార్టర్సు. ఆ ప్రాంతాలకల్లా పెద్ద బస్తీ. చారిత్రక స్థలం. ఎల్లోరా, అజంతా గుహాలు దర్శించటానికి వచ్చే జనానికిది కేంద్రం. రాష్ట్రపునర్వ్యవస్థీకరణంలో ప్రస్తుతం యిది బొంబాయి రాష్ట్రానికి చేర్చబడింది. ఉర్దూ, హిందీ, మహారాష్ట్రం తప్పితే, తెలుగు మాట్లాడే వ్యక్తి బొంబాయినుంచి యీ నగరంవరకూ మా కెవ్వడూ కనబడలేదు. 27-12-56 నాటి రాత్రి యేడున్నరకు మన్మాడుకు వెళ్ళే యెక్సుప్రెస్సులో మేము బొంబాయినుంచి బయలుదేరాము. మేము రిజర్వు చేయించుకొన్న కంపార్టుమెంటులో చేరే సరికే, కిటకిటలాడే జనంతో పెట్టెలన్నీ కలకత్తా చీకటిగదులయినాయి. ఏలాగయితేనేం? – ఆ రాత్రల్లా మా కొక కాళరాత్రి, శివరాత్రి. 28-12-56 న॥ ఉదయం 5.30 లకు ఔరంగాబాదు స్టేషనులో దిగి దంతధావనాలు చేసుకొని ప్లాటుఫారంస్టాల్లో వేడివేడి (గరంగరం) 'చా'తో 'జల్లు'మని చల్లబడ్డ శరీరాలకు 'వెచ్చదనం' – 'హుషారు' – కలిగించుకొని, బస్సులెక్కి వూరుచేరి, మాకై ప్రత్యేకించబడ్డ "గెండాభవన్"–లో మకాం చేశాం. మా ప్రధానోపాధ్యాయుల (ముందు) ప్రయత్నంవల్ల అక్కడి తాసీల్దారుచే నియమించబడ్డ రివిన్యూయిన్‌స్పెక్టరు శ్రీ పటేలుగారు, మఱి యిరువురు జవానులు, ఔరంగాబాదులో మాకన్ని సౌకర్యాలు కుదర్చటానికి, మా కార్యక్రమం సక్రమంగా నెరవేరటానికి చాల వరకు సహాయపడ్డారు. ఆ వుదయం హోటల్‌నుంచి వచ్చిన కాఫీఫలహారాలు సేవించి స్నానపానాలు ముగించుకొని, యిండ్లకు వుత్తరాలు వ్రాసుకొనేలోపల వంటలు అయినాయి. వెంటనే 11 గంటలకు భోజనాలు కాజేసుకొని, రెండ పూటకు కావలసిన టిఫిన్ (ఉప్మా) తప్పేలాతో మాకై యేర్పాటుచేసుకున్న రెండు బస్సులలో కూచున్నాం. బస్సులు కదిలాయి. ఔరంగాబాదుకు ఎల్లోరా గుహాలుండే పర్వతారణ్య ప్రదేశం 14 మైళ్లు దూరంలో వున్నది. - నేలమట్టందాటి కొండలమీది వంకర టింకర బాటలగుండా మా బస్సులు వాయువేగ మనోవేగాలతో పరుగిడుతూ వుండేటప్పుడు, పరిసరాల్లోని ప్రకృతి దివ్య దృశ్య ప్రపంచమంతా- అక్కడే ప్రత్యక్షం అయినట్టు హృదయాలకు ఆహ్లాదాన్ని కన్నులకు పండువును చేకూర్చినాయి. అక్కడ అంతకంతకు మేము పర్వతోపరిభాగాలకు చేరుకోవడం గమనిస్తే, దేవవిమానాలమోస్తరు మా రెండు బస్సులు మమ్మల్ని అమరావతీ ప్రాంతాలదరికి చేరవేస్తూన్నట్టు తోచింది. తీరా గుహాల ముఖద్వారం వరకు ఆ విధంగా పయనించి, బస్సులుదిగి వరసగా ఉండే గుహాలు చూడసాగాం. అందులో బౌద్ధ గుహాలు 17 జైన గుహాలు 5, హిందూ గుహాలు 17 వున్నాయి. ముఖ్యంగా దర్శనీయాలు - కైలాస దేవాలయం, కారువులగుహ.

ఆ కొండ రాళ్లను మలిచిన స్థపతుల శిల్పకళా ప్రావీణ్యాన్ని ప్రతిగుహ వేనోళ్ల చాటుతున్నది. కొన్నిగుహాలు రెండతస్థులు కలిగినవికూడా వున్నాయి. ఒక్కొక్క గుహలోనూ - ముందు విశాలం అయిన పెద్ద మండపం, దాని కొసను యెత్తయిన గర్భగుడి,

గర్భగుడిలో బ్రహ్మాండమయిన విగ్రహం. ఈ విగ్రహం పీఠంమీద ఒక కాలు ముడుచుకొని, రెండోది నేలతగిలేట్టు వ్రేలాడవేసి కూర్చున్న బుద్ధదేవుడిది. ఇరుపార్శ్వాలా రెండు స్త్రీ విగ్రహాలు, పైన మూలల్లో గంధర్వ రూపాలు. అందాలు చిందే యీ ప్రతిమల్ని ఆ గాఢాంధకార గర్భగృహాల్లో శిల్పులు రాత్రింబగళ్లు యెన్ని యేండ్లు యే వెల్తురు సహాయంతో మలిచారోగాని, వచ్చే ప్రేక్షకులందరూ టార్చిలైట్లు వేసుకుంటేగాని వాటి సౌందర్యం చూడటానికి వీలుకాదు. ఈ శిల్ప చిత్రాలు ప్రతి గుహకుడ్యాలమీదా, స్థంభాలమీదాకూడా కనిపిస్తాయి.

ఇలాటి యెల్లోరా గవులన్నీ ఒక యెత్తయితే, - కైలాసదేవాలయం మాత్రం వొక యెత్తనిపిస్తుంది. ఒంటిరాతిలో చెక్కబడ్డ యేనుగులంతటి యేనుగుల పోరాటం, రాతి ధ్వజస్తంభం, దేవళంలో అడుగు పెట్టగానే కనిపిస్తాయి. ఆ తర్వాత రెండంతస్థులుగల ఆవణంలోని మంటపాలు, వాటిలో - వీరభద్రావతారం, రావణుని కైలాసపర్వతోద్ధరణం, శివతాండవం, అర్ధనారీశ్వరరూపం - ఇలాటి శివలీలలు పదేపదే ప్రతిచోట శోభాయమానంగా నేత్రోత్సవం చేస్తూ వుంటాయి.

కళావికాసంతో వుర్రూతలూగే మనస్సులతో యిలా ప్రకృతిమానోజ్ఞకాన్ని తనివితీరా ఆస్వాదించి, బస్సుల్లోపడ్డాం. ఈ తిరుగు ప్రయాణంలో త్రోవలోని ఔరంగజేబు గురువు సమాధి దర్శించాం. ఔరంగాబాదును ఆనుకొని ఔరంగజేబు భార్య అయిన "బీబీ కా మక్బారా" అనే రాణిగారి సమాధికూడా దర్శించాం. ఈ సమాధి ఆగ్రాలోని టాజిమహాలు నమూనాలో కట్టబడిన దివ్యమయిన కట్టడంలో వున్నది. దాని దర్వాజాలో చలవరాతి మీద చెక్కించబడ్డ శాసనాంశాలవల్ల ఈ సమాధి విషయం కొంతవరకు తెలుస్తున్నది:—

"దీన్ని నిర్మించినవాడు మొగల్ చక్రవర్తి అయిన ఔరంజేబు కుమారుడు "అజ్జంషా" అనే అతడు. "దిల్రాస్ బాను" — లేక — "రాబియా" అని ప్రసిద్ధికెక్కిన తన తల్లిపేర (ఆమె జ్ఞాపకార్థం) దీన్ని క్రీ. శ॥ 1660 లో కట్టించాడు. దీని శిల్పులు ఆ కాలంలో కళావేత్తలని విఖ్యాతిని ఆర్జించిన — "అతలుల్లా" — "హంసపంత్ రాయ్" — అనే వారు. — వారి అత్యద్భుత చాతుర్యానికి, కళావేదిత్వానికి, నిర్మాణానికి మెచ్చి 'అజ్జం' 668208 రూపాయలు వారి కిచ్చాడట !"

దీన్ని - ఇలాటి చూడదగిన మరికొన్నిటినిన్ని చూచి, ఆరాత్రి బసకు చేరుకొని, భుజించి, ముందు రేయి జాగారం అయినందున, ఘటాలు అలిసివున్నందున పడకలుచేరి కుంభకర్ణుడికి దీర్ఘలేఖలు వ్రాయసాగాము. 29వ-తారీఖున ఉదయాన్నే లేచి కాలకృత్యాలు, స్నానాలు, కాఫీఫలహారాలు పూర్తికాగానే అజంతాకు ప్రయాణం అయినాం. వంటలు కాగానే భోజనాలు అక్కడికే తెమ్మని వంటవాళ్ళకి పురమాయించాం.

ఔరంగాబాదు నగరానికి ఉత్తరంగా 55 మైళ్ళ దూరంలో — దివ్యాంబరాభరణ ప్రభాభాసమాన అయిన ప్రకృతి కాంతవొడిలో కళాసంపన్న అయిన అజంతా శిల్పచిత్రకన్య వన్నెవన్నెల చిరునవ్వు వెన్నెలలు గురుస్తూ ముగ్ధమనోహరమూర్తియై కేరింతలతో కేకి సలాడటం నిర్నిమేషంగా అవలోకించే రసికుల్ని తన్మయుల్నిగా చేసేంత ముచ్చటగా ఉంటుంది.

ఎల్లోరాలో మోస్తరు ఇక్కడి శిల్పచాతుర్యాన్ని ప్రేక్షకులు ఉచితంగానే చూడవచ్చు. కాని, అందులోని వర్ణచిత్రాలు మొదలయినవాటి వివరాలు తెలుసుకోవలెనంటే, ప్రభుత్వంచేత నియమింపబడ్డ అధికారులు ప్రేక్షకుల సంఖ్యనుబట్టి కొంత మొత్తం సుంకంగా వసూలుచేస్తారు. ఇక్కడ మొత్తం మీద 29 గుహాలున్నాయి. అందులో అయిదు మాత్రం చైత్యాలు; తక్కినవి విహారాలు. ఇక్కడి గుహాలలోని గోడలు, స్తంభాలు, మంటపాలు, వాటిపై కప్పుల లోభాగాలు అన్నీ నానావర్ణములతో అద్భుతంగా రంగులకుంచెల చేతిపనితనంతో ప్రకాశిస్తూవున్నాయి. కొన్ని గుహాల్లో వన్నెలుతుడుచు

కొని పోయినాయి, కొన్ని పోతున్నాయి. రెండు మూడు గుహల్లోని ఇంకా పూర్వచిత్రకారుల నేర్పును, రంగా బీపుల కౌశలాన్ని విశదపరుస్తున్నాయి. చెడని వర్ణచిత్రాలను అక్కడి వుద్యోగులు పెద్ద సైనమోలైటు సహాయంతో ప్రేక్షకులకు— ఇంగ్లీషు, మహారాష్ట్రం, హిందీ భాషల్లో (దేల్లోనైనా) స్పష్టంగా బోధపడేటట్లు చూపుతూ వివరిస్తారు. సావధానంగా విందామనే జిజ్ఞాస గలవాళ్ళకు ఒక గుహను చూచేసరికే 2 గంటలవుతుంది. మేము అన్నిటినీ 10 గం॥నుంచి 2 గంటలవరకే చూడగలిగాం. ఈ గుహలన్నిటికీ చివర ఒక జలపాతం. అది పైనించి, క్రిందికీ 5000 వందల అడుగల లోతున వుండే లోయలోకి దిగజారడం ఒక విచిత్ర రమణీయ సన్నివేశం.

అవన్నీ చూచి మధ్యాహ్నం రెండున్నరకు పైగా భోజనం (సాంబారు, పెరుగన్నాలు) తనివితీర భుజించి సెలయేటిపాయిలో నీళ్ళుత్రాగి బస్సులలో సాయంకాలం 6 గంటలికి మాబస చేరుకుంటూ, దోవలో దౌలతాబాదుకోట చూచాం. నిటారుగా వుండే కొండమీద ఈ కోటకు వెళ్ళేమార్గం మరచుట్టవలె తిరుగుళ్లు తిరుగుళ్లుగా వుంది. ఇక్కడ రాచనగళ్లు, క్రీడోద్యానాలు, దేవళాలు మసీదులు చూడదగ్గవి. ముఖ్యంగా కోటముఖద్వారంలోని రాతిగోపురం (Minar) 210 అడుగులయెత్తు, 70 అడుగుల కైవారం గలది.

ఈ దౌలతాబాదుకు పూర్వపుపేరు దేవగిరి. కాకతీయ చక్రవర్తులకాలంలో యాదవరాజుల కిది ముఖ్యనగరం. ఢిల్లీ చక్రవర్తుల ఆక్రమణలోకిది వచ్చిన తర్వాత మహ్మదు బీన్ తుగ్లకు అనే పాదుషా, దీన్ని ముఖ్య నగరం చేసుకోనవలెననీ, ఢిల్లీ ప్రజలందరూ, దాన్నివదలి ఈ పురంలో నివాసాలేర్పరచుకోవలెననీ, అలాచేయనివారు కఠినదండనలకు పాత్రులు కాగలరనీ శాసించాడు. రాజాజ్ఞ ప్రకారం ముసలీముతకా పిల్లాజల్లా అంతా కొన్ని వందల మయిళ్ళ దూరంలోనియీ దౌలతాబాదుకు ఢిల్లీనుంచి బయలుదేర సగం సగం దూరంలో కొందరు రాలిపోవడం తటస్థించింది. మరికొందరు సాంక్రామిక వ్యాధులకు పాలుపడ్డారు. తుగ్లకు స్వయంగా వారిదుర్భరస్థితినీ, త్రోవలో మరణించి క్రుళ్లుపట్టి భయంకరంగా కనబడే శవాల్ని చూచి, జాలిపడి, తిరిగీ (సగందూరంవచ్చిన) ఢిల్లి ప్రజలను వెనక్కి మళ్లక తప్పదని ఆజ్ఞాపించాడు. ఇది చారిత్రికగాథ. మేము ఈ కోటను చూచినతర్వాత బసకుచేరి రాత్రి 8–30 కి భుజించి మాసామానులంతా సర్దుకొని, ప్రయాణమయి, రైల్లో మారిజర్వుడు కంపార్టుమెంటును ఆక్రమించుకొనికూచున్నాం. ఆ బండి నిజామాబాదు మీదుగా హైదరాబాదుకు 1 గంటకు కదిలింది.

(సశేషము)

(88-వ పేజీ తరువాయి)

ఒప్పుకుని మీరు గుర్రాన్ని కొన్నారు. దానికోసం ఇంతకంగారు పడటం చూస్తే ...... సరే! గుడ్డిదా? దానికి మనం ఏం చేస్తాం – గుర్రం దురదృష్టం అలాగుడ్డిదిగా పుట్టటం! దాన్ని మనం ఒప్పుకోక మరేం చేయగలుగుతాం ... "అంటూ తడబడక ఆయనికి సూటిగా జవాబు ఇచ్చాడు ...

## అద్దం చేసిన మోసం!

కొంతకాలం క్రిందట ఇంగ్లాండులో భాగ్యవంతుల ఇళ్లల్లో పనిచేయటానికని నీగ్రోపిల్లల్ని ఆఫ్రికానుంచి పంపారు. అలాటి నీగ్రోపిల్లల్లో ఒక అబ్బాయి ఒక భాగ్యవంతురాలి ఇంట్లో పనిచేయటానికి ప్రవేశించాడు. ఆ లోగిలి రాజభవనానికి మల్లె పెద్దది. ఏగదిలో చూసినా అద్దాలు. వాటిని చూశాడో లేదో ఆ అబ్బాయి స్థంభించి పోయాడు. యజమాని వాడికంగారుని చూసి ఆశ్చర్యపడింది. ... వాడి దృష్టి అంతా ఆ అద్దంమీదే. అలా చూస్తూ వున్నంతసేపు బుర్రలో ఎలాటి ఆలోచనలు రేకెత్తి పోతూవున్నాయో, పాపం! కొంచెంసేపు వూరకుండి "ఆ! అదిగో! ఆ అబ్బాయి! వాడు నా తమ్ముడు ఇక్కడికి ఎలా వచ్చాడు?" అంటూ ఒక గంతువేసి అద్దం దగ్గరికి గబగబ పరుగెత్తాడు ... అద్దాన్ని అమాంతంగా కొట్టాడు. అద్దం ముక్కలయింది. అబ్బాయి చేతినిండారక్తం. రక్తాన్ని చూస్తూ హడలిపోయాడు ......

వాడి దేశంలో అంతవరకు అద్దాన్ని చూచినవాడు కాదు. ఇదే అద్దం అన్న వస్తువుని చూడటం మొదటిసారి. దాన్లో కనబడింది వాడి ప్రతిబింబమే అయినా తన తమ్ముడే తనకి చెప్పకుండా అక్కడికి వచ్చి తనకేసి ఎగాదిగా చూస్తూ వున్నాడని భ్రమపడ్డాడు. అంచేతనే ఇలా అద్దాన్ని పగలగొట్టి బాధపడుతూవున్నాడు.

---

# శ్రీ సాయి సన్నిధి—నా అనుభవాలు

శ్రీ ఆర్కాట్ సుందరేశ్వరరావు బి. ఏ., బి. టి.



శ్రీ సాయిబాబాను గురించి తెలియనివారుండరు. ఆయన కరుణాకటాక్షములకు పాత్రులైన భక్తులు అనేకులుకలరు. శ్రీ బాబాకు తన భక్తులయెడగల ప్రేమ అవ్యాజమైనది. మనము ఎన్ని తప్పులను చేసినను, పాపముచేసినను పశ్చాత్తప్తులమయి శ్రీ బాబాను శరణుజొచ్చినచో రక్షించి కాపాడుచుండునను విషయము నా స్వానుభవము.

నాకు శ్రీ బాబాను గురించి 1939 లోనే తెలియవచ్చెను. వారి చిత్ర పటము దీపావళికి ముందుగనే మా యింటికి చేరింది. ఆదినమే రాత్రి శ్రీ బాబా మా తల్లికి కలలో కనుపించి "నీ యింటికి వచ్చినానని సంతోషపడవద్దు. నీ కింకా ఎనిమిది సంవత్సరముల కాలము కష్టములుండును. కష్టపు రోజులు గడిచిపోతే నీ కుమారుడిని గొప్పవానిగా జేసెదను" అని చెప్పెను. అప్పుడు నేను V ఫారం చదువుచున్నాను. కాలక్రమమున శ్రీ బాబా పలుకులు యదార్థములాయెను. నేను ఇంటర్ మీడియేటు ప్యాసయి బి. ఏ. చదువుటకు ప్రయత్నించుచుండగా ప్రయత్నములు ఫలించే సూచనలు కనుపించక నిస్పృహా నన్నావరించెను. ఆ సమయంలో శ్రీ బాబా మరల మా తల్లికికలలో కనుపించి "నీ బిడ్డను మదరాసుకు పంపుము. అతనికంటె ముందు నేను వెళ్లుతున్నాను. నీ బిడ్డ చదువుకోడానికి అవసరమగు వసతులను నేనమర్తును-తప్పకుండా పంపుము" అని చెప్పగా చేత రైలు చార్జి డబ్బులు మాత్రమున్నా, దాంతోనే మద్రాసుకువచ్చి లయోలా కాలేజిలో బి. ఎ. క్లాసులో చేరాను. క్రమంగా సమకూరిన ట్యూషన్లు చెప్పుచూ బి. ఏ. చదివి పరీక్షప్యాసయితిని. 1945 సం॥ జనవరినెలలో మా తండ్రి దివంగతులైరి. దాంతో మా కష్టాలు మరీ యధికమయి, తిండికిలేని దినములు కూడ గడచినవి. 1946 సం॥ నా కారోగ్యముచెడి హాస్పిటల్లోచేరి 1947 సం॥ మే నెలలో బయటికి వచ్చితిని. సెప్టెంబరునెలలో ఉద్యోగంలో చేరితిని. 1948 సం॥ ఉద్యోగంలో ప్రమోషను లభించి శ్రీ సాయిబాబా అనుగ్రహమువలన ఎనిమిది సంవత్సరములు ఎనిమిది యుగాలులాగ గడచిన మా కష్టకాలము తొలగిపోయింది. 1947 నుండి యీ నాటి వరకు శ్రీ బాబా కరుణా కటాక్షములు మమ్ములను కాపాడుతున్నవి.

నా సోదరికి కొంతకాలమునుండి ఆరోగ్యము సరిగ్గాలేదు. అనేకమంది వైద్యులు పరీక్షచేసి వ్యాధి నిర్ణయముచేసి చికిత్సచేయజాలకపోయిరి. మాకిక శ్రీ బాబాయే దిక్కని నమ్మితిమి. 1956 సం॥ డిశంబరునెల 8-వ తేదిన ముసలివాని రూపమున మా చెల్లెలికి కలలో కనుపించి "ఇచ్చటికి 6 మైళ్ళదూరమున ఒక దివ్య పురుషుడున్నాడు. ఆయన నీ కారోగ్యమును ప్రసాదించగలడు. మీ అన్నగారితో నిన్నచటికి పిలుచుకొని వెళ్ళవలసినదిగా కోరుము" అని శ్రీ బాబా చెప్పెను. ఆమె ఆ మాటలను నాకు చెప్పినప్పుడు నాకు వాని యర్థము తెలిసినదికాదు. మరుసటిరోజు రాత్రి మరల కలలో కనుపించి "నేను చెప్పిన దివ్య పురుషుడు మంత్రగాడుకాదు. మీ

అన్న ఆయన దగ్గరకు వెళ్ళుచున్నాడు. ఆయనను తనవెంట నిన్ను పిలుచుకొని వెళ్ళమనుము” అని చెప్పెను. ఆమె మరల తన స్వప్న వృత్తాంతమును నాతో చెప్పగనే శ్రీ సాయిభక్త కేశవయ్యగారి రూపము నా కండ్లలో మెరసెను. ఇప్పుడు ప్రతి గురువారం వెళుతున్నాము. శ్రీ కేశవయ్యగారిద్వారా శ్రీ సాయిబాబా కరుణా కటాక్షములు లభ్యమయి నా చెల్లెలి ఆరోగ్యము క్రమంగా చక్కబడుచున్నది.

1954 సం॥ నేను మొట్టమొదట శ్రీ సాయిభక్త కేశవయ్యగారిని సాయినిలయంలో దర్శించినప్పటి నుండి నాలో ఏదో గొప్ప మార్పు - ఆనందము, మనశ్శాంతి, ఆత్మబలము సమకూరి మరింత ఉత్సాహంగా శ్రీ బాబా పూజారాధనలలో ప్రాగ్లాన ఆసక్తి ప్రబలినది. నేను మొదట వెళ్లినప్పుడు భక్తుల అల్ప సంఖ్య; క్రమంగా వందలు, వేలుగా పెరిగి వరుసదీరి ప్రతి గురువారం సాయంకాలము 5 గం॥ల నుండి రాత్రి 12 గం॥ల వరకు వ్యయప్రయాసలకు సయితము లక్ష్యముచేయక నిలబడి శ్రీ బాబా అనుగ్రహ కటాక్షములకని వేచియుండు భక్తులుపొందే ఆత్మానందము, సంతృప్తి పేర్కొన తగినవి.

శ్రీ సాయిభక్త కేశవయ్యగారి మహిమాన్వితమైన శ్రీ బాబా పూజారాధనలను గురించి శ్రీ సాయి సమాజ్ వ్యవస్థాపకులు కీ॥ శే॥ శ్రీ నరసింహస్వామి గారు ఒకప్పుడు కోయంబత్తూరులో బహిరంగ సభయందుపన్యసించుచు “నా పూజలు ప్రతి వేయి మందిలో నూరుమంది భక్తులకు లాభించినచో శ్రీ కేశవయ్యగారి పూజలు ప్రతివేయిమంది భక్తులలో తొమ్మిదివందలమందికి లాభించగలవని” వివరించారట.

ఇందులో అతిశయోక్తి ఏమాత్రములేదు. ప్రతి గురువారం షెణాయ్‌నగరమునకువచ్చి శ్రీ సాయి నిలయంలో శ్రీ సాయిభక్త కేశవయ్యగారిద్వారా శ్రీ బాబా అనుగ్రహ కటాక్షమునకు పాత్రులగుచున్న వేలకొలది భక్తులే యిందుకు నిదర్శనము.




**శాంతాకనకం (దశరంగరూపకం): శ్రీ దాసరి వేంకట కృష్ణయ్యగారు. ప్రచురణకర్తలు సాహిత్యలతా గ్రంథమాల, గుంటూరు. వెల రు. 1-8-0.**

ఇది దృశ్యనాటిక. గ్రంథకర్త ఒక కుటుంబగాధను కావ్యవస్తువుగా గ్రహించి సంపన్నుల పోకడలను, న్యాయాన్యాయాల మధ్యగల వైరుధ్యమును, పవిత్రమైన ప్రేమస్వరూపమును, సంపద సాధారణముగా చేసికొని జరుగుచున్న ఘోరకృత్యములను, చిత్రించుటకు ప్రయత్నించాడు. రచన వాడుకభాషలో జరిగి పాత్రపోషణ ఒకమోస్తరుగా జరిగినది. కధనడక తెంపుగా లేకపోయినా పాఠకులలో చదువుతున్నంతసేపు ఆ సక్తిని కలుగజేస్తూ మనసంఘపు స్వరూపమును చాలవరకు చిత్రిస్తున్నది. గ్రంథకర్త కృషి ముందుముందు యింకా మంచి నాటికలను రచించుటకు తోడ్పడగలదని ఆశిస్తున్నాము.

**వినోబాజీవితం: శ్రీలవణం. ప్రచురణకర్తలు భూదానసాహిత్య ప్రచార సమితి, సుల్తాన్‌బజారు, హైదరాబాదు (దక్కన్) వెల 0-3-0.**

కలిమిలేముల మధ్యగల తారతమ్యాన్ని తగ్గించి యావత్ప్రజానీకం సమానహక్కులు, అవకాశములననుభవిస్తూ ఎవరిబాధ్యతలను వారు నిర్వహించనవకాశముండునట్టి నవసమాజ నిర్మాణమునకు తోడ్పడగల భూదానా, సంపద్దానోద్యమాలను ప్రారంభించి దిగ్విజయంగా నిర్వహించుచున్న స్వార్థరహితుడు శ్రీ వినోబా. ఆయన జీవితచరిత్రయంటే ఆయన ఉద్యమ ఆదర్శలక్ష్యాల చరిత్రయనియే చెప్పాలి. ప్రజల శ్రేయోపురోభివృద్ధులను తీర్చిదిద్దనుద్దేశించిన భూదాన ఉద్యమం ద్విగుణీకృతంగా దేశపు నలుమూలలా విస్తరించి ఆచార్యవినోబాజీ కృషిఫలించుటకు యీ చిన్న పుస్తకం ఉపకరించగలదని ఆశిస్తున్నాము.

♦ ♦ ♦

'ఆంధ్ర మహిళ' 13 వ వార్షికసంచిక మాకార్యాలయమునకు చేరినది. ఎప్పటికంటెకూడ ఆకర్షణీయంగా, అమూల్యమైన రచనలతోటి విజ్ఞాన వినోదములను పూరిస్తూ అభ్యుదయమును ప్రోత్సహించుచు రూపొందినందుకు ఆంధ్రమహిళ సంపాదకురాలు శ్రీమతి లక్ష్మీ రఘురాంగారు అభినందనీయులు.

ముఖ్యంగా మహిళా, సంక్షేమ, సాంస్కృతిక, సంగీత, సాహిత్యరంగాలకు సంబంధించిన వ్యాసములు చేర్కొనతగినవి.

ఈ సంచిక వెల రు. 2-0-0. వలయువారు సంపాదకులకు ఆంధ్రమహిళాసభ, మద్రాసు 4-కు వ్రాసి తెప్పించుకోవచ్చును.

---

## రిపబ్లిక్ దిన వేడుకలు

కేసరి హైస్కూలులో జనవరి 26-వ తేదిన జరిగిన రిపబ్లిక్ దినవేడుకల సందర్భమున కేసరి విద్యాసంఘ కార్యదర్శి దివాన్‌బహదూరు బండి శ్రీ హరిరావునాయుడుగారు జాతీయపతాకమును ఎగురవేసి మనదేశమునకు స్వాతంత్ర్యము సిద్ధించిన తరువాత యీనాటివరకు సాధించిన అభ్యుదయ పురోభివృద్ధులను వివరించారు

ప్రధానోపాధ్యాయులు శ్రీ కె. వెంకటరాజుగారు ఉపన్యసించిన తరువాత హైస్కూలు ఉపాధ్యాయులు శ్రీ నారాయణరావుగారు వందన సమర్పణము చేసిరి.

---

# సంపాదకీయములు

## ఆహార ధాన్యముల ధరలు తగ్గాలి !

ఆహార ధాన్యాల ధరలు పెరుగుటకు కారణము ధాన్యపు నిల్వలలోటుకాదు ; పండించిన ధాన్యము తక్కువయికాదు. స్వార్థపరులై అధిక లాభాల కొరకని ధరలు పెంచుటయే యీ నాటి పరిస్థితులకు కారణము.

రైతులు నష్టపడాలని కాని, రైతుల అభివృద్ధి అభ్యుదయాల నరికట్టాలని కాని ఏ ఒక్కరు ఆశించుట లేదు. కాని ప్రజల కొనుగోలు శక్తికి మించకుండా, రైతులకు న్యాయమైన గిట్టుబాటు ధరలకు ధాన్యము అమ్మకం జరిగేలాగ విధానమును రూపొందించవలసిన బాధ్యత ప్రభుత్వపుది.

ప్రజావసరాలను నిర్లక్ష్యముచేసి అధిక లాభాలకొరకు ప్రాకులాడే ఏ ఉత్పత్తిదారుడైనా, వ్యాపారియైనా జాతీయ శ్రేయస్సుకు తోడ్పడినవాడు కాజాలడు. జాతీయ శ్రేయస్సును విస్మరించే ఏ విధానమైనా ప్రోత్సహించతగినది కాదు. కేంద్రప్రభుత్వమైనా ఆహార ధాన్యాల ధరలను అదుపులో నుంచాలని ఆసక్తి చూపుచుండుట అభినందనీయము.

కేంద్రమంత్రి శ్రీ పంజాబ్ రావు దేశముఖ్ గారు చెప్పినట్లు అధికోత్పత్తి మాత్రము ధరల నరికట్ట జాలదు. ఉత్పత్తులు ప్రజల వినియోగానికిపోను మిగిలిన వానినే అన్య ప్రాంతాలకు, రాష్ట్రాలకు ప్రభుత్వ అజమాయిషీక్రింద ఎగుమతియయినప్పుడు ధరలు అదుపులోనుండి వినియోగదారులకు, ఉత్పత్తిదారులకు న్యాయము కలుగగలదు.

## సినిమా – నాటకరంగాలు

ప్రతి సినిమాహాలులో నాటకరంగం విధిగా నిర్మించాలని మంత్రి శ్రీ గోపాలరెడ్డిగారుచేసిన సూచన కళారాధకులు, పోషకులు పరిశీలించ తగినది.

నాటకకళ నాధారంగా చేసికొని అభివృద్ధిగాంచిన చలనచిత్ర రంగానికి నాటకకళ అవసరము తీరిపో లేదు. చలనచిత్రములలోని సన్నివేశాలను, సంఘటనలను నాటకరంగమువిూద ప్రదర్శించ సాధ్యముకానివి యున్నా జీవకళ అనిపించుకుంటుంది నాటకకళ. చలనచిత్రకళ ఎంత వాస్తవికతను ప్రదర్శించకలిగినా నాటకకళ సమకూర్చకలిగిన ఉత్సాహ, ఆనందాలను సినిమాకళ చేయలేకపోవచ్చును.

నాటకరంగం ఉత్తమ నటీనటులను తయారుచేయుటతోబాటు ఉత్తమ సాంప్రదాయములతోకూడిన సంగీత సాహిత్యములను, నృత్యములాంటి కళలను పోషించునది. నాటకరంగంలో శిక్షణపొందిన నటీనటులు చలనచిత్ర రంగంలో విజయవంతంగా పురోగమించగలరు.

ప్రేక్షకులు సయితము సినిమాలతోబాటు నాటకాలు సయితము అప్పుడప్పుడు చూచుచుండుటవలన ఏ ఒక్కదానిమీద ఏవగింపు ఉండదు. దీనివలన తోడుతోడుగా సినిమా, నాటకకళలు అభివృద్ధిగాంచగలవు.

---

## వివాహ మహోత్సవము

బెజవాడ సీతారామ జనరల్ స్టోర్సు (ఏజన్సీస్) ప్రొప్రైటరు శ్రీ శ్రీ రాం భీమశంకరరావుగారి కుమారుడు చి॥ రాధాకృష్ణమూర్తికి, శ్రీ కపలవాయి బాపనయ్యగారి కుమార్తె చి॥ సౌ॥ నగరాజ పూర్ణ లక్ష్మీకుమారికి యీ నెల 6-వ తేదిన వైభవోపేతంగా వివాహం జరిగింది. అయిదు రోజులు జరిగిన వివాహ వేడుకలలో నృత్య, గాన, వినోద ప్రదర్శనములు, ఆదరసత్కారములు పేర్కొన తగినవి.

భగవంతుడీ నూతన వధూవరులకు ఆయురారోగ్య ఐశ్వర్యాలనిచ్చి ఆదర్శనీయమైన దాంపత్య జీవితమును ప్రసాదించాలనియు, బంధుమిత్రుల ఆదరాభిమాన ఆశీస్సులతో తమ కుటుంబ అడుగుజాడలలో ప్రజాహితమును ప్రోత్సహించాలని ఆశిస్తున్నాము.

# శ్రీ దుర్ముఖినామ సం॥ర మాఘ, ఫాల్గుణమాసములు

| | | | |
|---|---|---|---|
| 1957 సం॥ ఫిబ్రవరి నెల | 16 | శ | విది 28-13 పూఫ 21-8 |
| | 17 | ఆ | త 22-48 ఉఫ 17-22 త్యా 3-48 |
| | 18 | సో | చ 18-8 హ 14-23 తిథిద్వయం |
| | 19 | మం | పం 14-31 చి 12-21 |
| | 20 | బు | ష 11-59 స్వా 11-25 వ్య 5-22 త్యా 4-2 |
| | 21 | గు | స 10-42 విశా 11-41 |
| | 22 | శు | అ 10-39 అనూ 13-11 హ 55-40 |
| | 23 | శ | న 11-50 జ్యే 15-51 త్యా 4-16 |
| | 24 | ఆ | ద 14-10 మూ 19-37 |
| | 25 | సో | ఏ 17-25 పూషా 24-17 |
| | 26 | మం | ద్వా 21-28 ఉషా 29-39 శూన్యతిథి |
| | 27 | బు | త్ర 26-1 శ్ర 35-30 మహాశివరాత్రి |
| | 28 | గు | చతు 30-49 ధ 41-34 త్యాజ్యాభావః |
| | 1 | శు | ● అమా 35-34 శత 47-31 |
| | | | **ఫా ల్గు ణ మా స ము** |
| 1957 సం॥ మార్చి నెల | 2 | శ | శుపా 40-0 పూభా 53-8 త్యా 4-23 |
| | 3 | ఆ | విది 43-50 ఉభా 58-10 |
| | 4 | సో | త 46-51 రే 60-10 త్యా 4-17 |
| | 5 | మం | చ 48-0 రే 2-7 త్యా 4-13 కుజచతుర్థి |
| | 6 | బు | ప 49-38 అశ్వ 5-13 శుక్రమౌఢ్యారంభం |
| | 7 | గు | ష 49-10 భ 7-9 కుమారషష్ఠి |
| | 8 | శు | స 43-25 కృ 7-53 |
| | 9 | శ | అ 44-26 రో 7-27 |
| | 10 | ఆ | న 40-20 మృ 5-44 |
| | 11 | సో | ద 35-19 ఆర్ద్రా 3-4 పున 46-39 |
| | 12 | మం | ఏ 29-35 పుష్య 55-28 |
| | 13 | బు | ద్వా 23-24 ఆశ్లే 50-54 త్యా 3-42 తిథిద్వయం |
| | 14 | గు | త్ర 16-59 మ 46-16 త్యా 3-42 |
| | 15 | శు | చ 10-39 పూఫ 41-52 త్యా 3-43 అహోబిల నరసింహస్వామి గరుడోత్సవం |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు 4-8-0. అర్థసంవత్సరపు చందా రు. 2-8 0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువ మేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితలకట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.







ఆరోగ్య సౌభాగ్యములకు
కేసరి రత్నత్రయము

## లోధ్ర

గర్భాశయ రోగ నివారిణి

ఈ ఔషధము ఉత్తమోత్తమము, నికరమయినదిగా యాభైఅయిదు సంవత్సరములుగా ప్రఖ్యాతిగాంచినది. స్త్రీల ప్రత్యేకమైన, ఋతుసంబంధమైన జబ్బులు, హిస్టీరియా, నిద్రలేమి, మలబద్ధకము. తలనొప్పి, వెన్నునొప్పి మొదలగు వాటికిది వరప్రసాదము.

## అమృత

రక్తశుద్ధి ద్రావకము

నిరుత్సాహుల నరములను బలపరచగల శ్రేష్ఠమయిన టానిక్. రక్తహీనత, అజీర్ణము మొదలగు జబ్బులయందిది నమ్మకముగ పనిచేయును.

## అరల

సర్వజ్వర నివారిణి

ఇది మలేరియా, ఇన్‌ఫ్లుయంజా మొదలగు జ్వరములను, జ్వరగడ్డలను కుదుర్చును.

పూర్తి వివరములకు:

## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.

ఒరిస్సా, ఆంధ్ర ప్రదేశ్‌కు ఏజంట్లు :
శీతారాం జనరల్ స్టోర్సు, బరంపురం, విజయవాడ & సికిందరాబాద్